

# శ్రీశ్రీ
# జాబులు

(శ్రీశ్రీ సాహిత్య సర్వస్వం - 11)

---

కూర్పు
చలసాని ప్రసాద్



విప్లవ రచయితల సంఘం
ఆంధ్రప్రదేశ్
1999

Madras
18.5.73

Dear Prasad,

By now you might have known the sad news. Mrs. Sri Sri is no more. The third attack (Tuesday 11.35 PM) was fatal. One of the earliest visitors the next morning was Sri Krishna Sastri.

Nearly, five decades of togetherness lay ~~been~~ shattered that night in less than twenty minutes. Mrs. Ramanamma's exit has left a void. I feel so empty, so lonely.

The empty space above, symbolizes my present state of mind.

Yrs sincerely,
Sri. Sri.

---


డిసెంబర్ 1999

**శ్రీశ్రీ జాబులు**

(శ్రీశ్రీ సాహిత్య సర్వస్వం - 11)

కాపీరైటు
శ్రీరంగం వెంకటరమణ
(జూనియర్ శ్రీశ్రీ)
2/1 ఎస్.బి. రోడ్డు
మండవల్లి, మద్రాసు-600 028

ప్రచురణ
విప్లవ రచయితల సంఘం
ఆంధ్రప్రదేశ్

కూర్పు
చలసాని ప్రసాద్
విశాఖపట్నం

టెక్స్ట్ కంపోజింగ్
శ్రీ సాయి షామిలి గ్రాఫిక్స్,
2-2-1090/ఎ/9, గోల్నాక
హైద్రాబాద్ ఫోన్ : 7561442

ముద్రణ
చరిత గ్రాఫిక్స్
చిక్కడపల్లి హైదరాబాద్
ఫోన్ : 7607361

సోల్ డిస్ట్రిబ్యూటర్స్
నవోదయ బుక్ హౌస్
3-3-865, ఆర్యసమాజ్ ఎదురువీధి
కాచిగూడ, హైదరాబాద్ - 500 027
ఫోన్ : 4652387

వెల : 25/-

# ముందు వెనకలు

ఈ 'జాబులు' సంపుటి పదకొండోది. ఆఖరదీ. ఇరవయ్యోది అయిన 'అనంతం' ముందుగా (1986) ప్రచురించాం. పంధొమ్మిదోదయిన 'ప్రజ' ప్రశ్నలు జవాబులు

ఆ తరువాత అయిదోదిగా (1990) ప్రచురించాం. 'జాబులు' చిట్టచివరకి ప్రచురిస్తున్నాం. జీవితం వడ్డించిన విస్తరికాదు. పస్తులేజాస్తి. బతుకు పూలబాటకాదు. అన్నీ ముళ్ళూ, రాళ్ళూ, అవాంతరాలే. ఈ మాటలు శ్రీశ్రీ జీవితానికి వర్తించినట్టే విరసం సాహిత్య జీవితానికి కూడా వర్తిస్తాయి. అష్టకష్టాలకీ, వ్యయ ప్రయాసలకీ లోనయి మేము శ్రీశ్రీ సాహిత్య సర్వస్వం ప్రచురించగలిగాం. చరిత్ర, సమాజం మాకు అప్పగించిన బాధ్యతగానే దీనిని మేము భావించాం. ఈ గురుతర బాధ్యతా నిర్వహణలో మావంతు కర్తవ్యం మేము నెరవేర్చాం. ఎందరెందరో ఎన్నెన్నో రకాలుగా మాకు ఊతం ఇచ్చారు. సాయపడ్డారు. అండదండలందించారు.

శ్రీశ్రీ జాబులు సొంతం సేకరించగలిగామని మేమనుకోవడం లేదు. మా ప్రయత్నలోపం లేదని మాత్రమే మేము చెప్పగలం. జాబులు పదిలపరచని వారిని ఏమీ అనలేం. అలాగే పోగొట్టు కున్నవారినికూడా తప్పుపట్టలేం. ఇవ్వనివారూ. ఇవ్వలేనివారూ కూడా అడపాదడపా వుండవచ్చు. ఇన్ని అవరోధాలని అధిగమించి ఈ సంపుటి మీముందుంచుతున్నాం.

పత్రికలకి శ్రీశ్రీ రాసిన జాబులు ఇందులో పొందుపరచలేదు. వస్తుప్రాధాన్యత రీత్యా అవి వివిధ సంపుటాల్లో చోటుచేసుకున్నాయి. అలాగే వ్యక్తులకి రాసిన కొన్ని జాబులు కూడా సందర్భానుసారంగా ఇతర సంపుటాల్లో చొప్పించాం. ఈ రెండు మినహాయింపులని సవ్యంగా అర్థం చేసుకుంటారనీ, సంపూర్ణంగా ఆమోదిస్తారని ఆశిస్తున్నాం.

శ్రీశ్రీ జాబులు అతని జీవితంలోని నీడలని మనకి చూపిస్తాయి. సాహిత్య చరిత్రలో ఇవి కూడా వుండవలసిందే. శ్రీశ్రీ వ్యక్తిగత జీవిత విశేషాలు కూడా సాహిత్య అభిమానులకి ఆసక్తికరంగా వుంటాయి. వీటన్నింటినీ దృష్టిలో పెట్టుకునే మేము ఈ సంపుటి ప్రచురిస్తున్నాం. మా పూనికనీ, ప్రయత్నాన్నీ నిండుమనసుతో ఆదరిస్తారని ఆశిస్తున్నాం.

విశాఖపట్నం
15-12-1999

చలసాని ప్రసాద్



(ఫోటో. జి. భూషణ్)

శ్రీశ్రీ జననం - 30.04.1910

శ్రీశ్రీ మరణం - 15.06.1983

ఒక
దశాబ్దికాలంపైగా
పట్టిన

శ్రీశ్రీ

సాహిత్య సర్వస్వం
20 సంపుటాలు
పూర్తవను
మనస్ఫూర్తిగా
ఎన్నో రూపాలతో
సహకరించి
తమ స్నేహహస్తాన్ని
అందించిన
సాహితీ మిత్రులు
సాహితీ సంస్థలు
ఎందరెందరికో
పేరు పేరునా
మా

# లాల్‌సలామ్

చలసాని ప్రసాద్
విరసం

## ఇంతవరకు అచ్చయిన శ్రీ శ్రీ పుస్తకాలు

1. ప్రభవ, కవితాసమితి, విశాఖపట్టణం 1928
2. వారం వారం, ప్రతిమాబుక్స్, ఏలూరు 1946
3. సంపెంగతోట, ప్రజాసాహిత్యపరిషత్తు, తెనాలి.
   అనువాదం Chekhov Cherry Orchard 1947
4. మహాప్రస్థానం, నళినీకుమార్, మచిలీపట్నం 1950
   విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ. దాదాపు 20 ముద్రణలు 1952 to 1984
   శ్రీ శ్రీ స్వంతదస్తూరి స్వంతగొంతుక విదేశాంధ్ర ప్రచురణ, లండన్ 1981
5. అమ్మ (కారల్ చాపెక్ Mother నాటకం అనువాదం)
   అరుణరేఖ ప్రచురణలు, నెల్లూరు సోషలిస్టు పబ్లికేషన్స్, విజయవాడ 1952 1967
6. మేమే, త్రిలింగ పబ్లిషర్స్, విజయవాడ 1954
7. మరో ప్రపంచం, రేడియో నాటికలు, సారథి పబ్లికేషన్స్, సికిందరాబాద్ 1954
   అరుణరేఖ ప్రచురణలు, నెల్లూరు 1956
8. 1 ప్లస్ 1 = 1 (అదే పుస్తకం పేరుమార్పు) రేడియో నాటికలు 1964, 1966
   విశాలాంధ్ర ప్రచురణాలయం విజయవాడ 1979, 1984, 1987
9. Three Cheers for man, Abhyudaya Prachuranalu, Madras 1956
10. చరమరాత్రి కథలు, గుప్తాబ్రదర్స్, విశాఖపట్నం 1957
11. మానవుడిపాట్లు (మైకేల్ షోలకోవ్ అనువాద నవల)
    విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ 1958
12. Soudamini, Puripanda's Poems translated into English,
    Addepally & Co రాజమండ్రి 1958
13. గురజాడ, నవసాహితి, హైదరాబాద్ 1959
14. మూడు యాభయిలు, విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ 1964
15. ఖడ్గసృష్టి, విశాలాంధ్ర ప్రచురణాలయం 1966, 1984
16. వ్యూలు, రివ్యూలు, ఎమ్వీయల్ మినర్వాప్రెస్, మచిలీపట్నం 1969
17. శ్రీ శ్రీ సాహిత్యం, 5 సంపుటాలు, షష్టిపూర్తి సన్మానసంఘం, విశాఖపట్నం 1970
18. Sri Sri's miscellany, English Volumes
    షష్టిపూర్తి సన్మానసంఘం, విశాఖపట్నం 1970
19. లెనిన్,(మయకోవ్‌స్కీ కావ్యం అనువాదం) ప్రగతి ప్రచురణ, మాస్కో 1971
20. రెక్క విప్పిన రివల్యూషన్(Beginning of the end అనువాదం)
    ఉద్యమసాహితి, కరీంనగర్ 1971
21. వ్యాసక్రీడలు, నవోదయ పబ్లిషర్స్, విజయవాడ 1973
22. మరోమూడు యాభయిలు, ఎమెస్కో, సికింద్రాబాద్ 1974
23. చైనాయానం, స్వాతిప్రచురణలు, విజయవాడ 1980
24. మరోప్రస్థానం, విరసం 1980
25. సిప్రాలి, అమెరికాలో ఫొటోకాపి 1981
26. పాడవోయి భారతీయుడా, శ్రీ శ్రీ ప్రచురణలు, మద్రాసు 1983
27. శ్రీ శ్రీ వ్యాసాలు, విరసం 1983
28. New Frontiers, విరసం 1983

ఇవేకాక ఎక్కడా అచ్చుకాని శ్రీ శ్రీ రాతప్రతులూ, ఉదాహరణకు "కొండయ్యగారిగది", కృష్ణ కృష్ణ నాటకాలు - పత్రికల్లో అచ్చయి, పుస్తకరూపంలో రాని రచనలు చాలా వున్నాయి. అన్నీ కలిపి మళ్ళీ వర్గీకరించి శ్రీ శ్రీ సంపూర్ణ సాహిత్యం మొత్తం 20 సంపుటాలుగా విరసం ప్రచురిస్తున్నది.

# మా ప్రత్యేక కృతజ్ఞతలు

## పత్రికలు

| | | | |
|---|---|---|---|
| ఆంద్రపత్రిక | వారపత్రిక | విజయభాను | వారపత్రిక |
| ఆంధ్రపత్రిక | దినపత్రిక | తెలుగువెలుగు | వారపత్రిక |
| భారతి | మాసపత్రిక | జయశ్రీ | వారమాసపత్రిక |
| ఆంధ్రప్రభ | దినపత్రిక | తెలుగు స్వతంత్ర | వారపత్రిక |
| ఆంధ్రప్రభ | వారపత్రిక | నవోదయ | వారపత్రిక |
| ప్రతిభ | త్రైమాసిక | ఆనందభారతి | మాసపత్రిక |
| జ్వాల | మాసపత్రిక | లలిత | మాసపత్రిక |
| ఉదయిని | ద్వైమాసిక | రూపవాణి | మాసపత్రిక |
| వీణ | మాసపత్రిక | కథావీధి | మాసపత్రిక |
| ఢంకా | మాసపత్రిక | సచిత్ర | మాసపత్రిక |
| మాలి | మాసపత్రిక | అరుణరేఖ | మాసపత్రిక |
| ఆనందవాణి | వారపత్రిక | అభ్యుదయ | మాసపత్రిక |
| ప్రజాశక్తి | వార,దినపత్రిక | కిన్నెర | మాసపత్రిక |
| విశాలాంధ్ర | దినపత్రిక | యువ | మాసపత్రిక |
| విశాలాంధ్ర | పక్షపత్రిక | స్వాతి | మాసపత్రిక |
| జనశక్తి | వార, దినపత్రిక | ప్రజాతంత్ర | వారపత్రిక |
| పెంకిపిల్ల | మాసపత్రిక | జ్యోతి | మాసపత్రిక |
| తెలుగుసంక్రాంతి | మాసపత్రిక | ఆంధ్రజ్యోతి | మాసపత్రిక |
| జ్వాల | వారపత్రిక | ఆంధ్రజ్యోతి | దినపత్రిక |
| సంవేదన | త్రైమాసిక | ఆంధ్రజ్యోతి | వారపత్రిక |
| నవత | త్రైమాసిక | సుభాషి | మాసపత్రిక |
| సృజన | మాసపత్రిక | ఆంధ్రభారతి | మాసపత్రిక |
| అరుణతార | త్రైమాసిక, | ఆంధ్రభూమి | మాసపత్రిక |
| | మాసపత్రిక | కల్యాణి | మాసపత్రిక |
| ప్రభంజనం | పక్షపత్రిక | ఆంధ్రవిద్యార్థి | మాసపత్రిక |
| విద్యుల్లత | మాసపత్రిక | తెలుగుతల్లి | మాసపత్రిక |
| ప్రజాపోరాటం | వారపత్రిక | కాగడా | వారపత్రిక |
| జయప్రద | వారపత్రిక | బాల | మాసపత్రిక |

| | |
|---|---|
| చందమామ | మాసపత్రిక |
| కవిత | సంకలనం |
| | మొదటిది, రెండోది) |
| కృష్ణాపత్రిక | వారపత్రిక |
| వాణి | పక్షపత్రిక |
| కళాకేళి | మాసపత్రిక |
| వసుధ | మాసపత్రిక |
| ఆంధ్రశిల్పి | మాసపత్రిక |
| సోవియట్ భూమి | మాసపత్రిక |
| వైశాఖి | కవితా సమితి |
| | వార్షికసంచిక |

శ్రావణి, గద్య, పద్య వ్యాసావళి

## గ్రంథాలయాలు

సారస్వత నికేతనం, వేటపాలెం
భ్రమరాంబ గ్రంథాలయం, విజయవాడ
గౌతమీ గ్రంధాలయం, రాజమండ్రి
గౌరీ గ్రంథాలయం, అనకాపల్లి.
శారదా గ్రంథాలయం, అనకాపల్లి.

## వ్యక్తులు

నండూరి రామ్మోహనరావు
పురాణం సుబ్రహ్మణ్యశర్మ
పరుచూరి హనుమంతరావు
పరుచూరి సుబ్బయ్య
వేమన వసంతలక్ష్మి
పి. నాగభూషణం
వెల్లంకి రాఘవయ్య
వెలగా వెంకటప్పయ్య
పాటిబండ్ల దక్షిణామూర్తి
లంకా సూర్యనారాయణ
మంగెన గంగాధరరావు
ఎల్.బూదేశ్వరరావు
సన్నిధానం నరసింహశర్మ
రాపోలు సుదర్శన్
కె.వి.ఆర్
సజ్జావెంకటేశ్వర్లు
టి.కృష్ణాబాయి
ఆర్.కె.

విరసం

# శ్రీశ్రీ సాహిత్య సర్వస్వం -11 జాబులు

| | | |
|---|---|---|
| 1. | పురిపండా | 20-7-40 |
| 2 | ఆరుద్ర | 1943 |
| 3. | ” | 19-10-43 |
| 4. | పురిపండా | 17-6-45 |
| 5. | ” | 26-6-45 |
| 6. | ” | 30-5-46 |
| 7. | ” | 14-6-46 |
| 8. | ” | 4-10-46 |
| 9. | ” | 8-1-47 |
| 10. | ఆరుద్ర | 25-3-47 |
| 11. | పురిపండా | 9-7-47 |
| 12. | ” | 1947 |
| 13. | ” | 10-8-47 |
| 14. | వరద | 27-10-47 |
| 15. | పురిపండా | 13-12-47 |
| 16. | అబ్బూరి రా.కృ. | 22-1-48 |
| 17. | పురిపండా | 21-2-48 |
| 18. | ” | 5-5-48 |
| 19. | ” | 3-7-48 |
| 20. | ” | 1948 |
| 21. | ” | 21-10-49 |
| 22. | ” | 24-12-49 |
| 23. | ” | 12-3-50 |
| 24. | ” | 9-6-50 |
| 25. | ” | 23-6-50 |
| 26. | ” | 12-7-50 |
| 27. | ” | 28-8-50 |
| 28. | ” | 20-9-50 |
| 29. | KVR | 30-1-51 |
| 30. | PAS | 24-2-52 |
| 31. | Moonas | 9-9-53 |
| 32. | వరద | 5-8-54 |
| 33 | Home Secretary | 12-10-54 |
| 34 | PAS | 14-10-54 |
| 35. | ” | 7-11-54 |
| 36. | తుమ్మల వెంకటరామయ్య | 13-11-54 |
| 37. | ద్వారం జగన్నాథ రావ్ | 26-11-54 |
| 38. | తు॥వెంకటరామయ్య | 8-3-55 |
| 39. | ” | ?-3-55 |
| 40. | వరద | 28-3-55 |
| 41. | ” | 1-4-55 |
| 42. | ” | 6-4-55 |
| 43. | తు॥వెంకటరామయ్య | 8-7-55 |
| 44. | PAS | 20-9-55 |
| 45. | వరద | 20-9-55 |
| 46. | తు॥వెంకటరామయ్య | 18-2-56 |
| 47. | PAS | 23-4-56 |
| 48. | తువెంకటరామయ్య | 3-4-56 |
| 49. | వరద | 6-7-56 |
| 50. | తు.వెంకటరామయ్య | 3-9-56 |
| 51. | ” | 18-2-57 |
| 52. | ” | 23-2-57 |
| 53. | హరి | 16-3-57 |
| 54. | PAS | 31-8-57 |
| 55. | ” | 9-1-58 |
| 56. | తు.వెంకటరామయ్య | 4-2-58 |
| 57. | ” | 12-6-58 |
| 58. | ” | 19-6-58 |
| 59. | ” | 24-4-59 |
| 60. | ” | 1-5-59 |
| 61. | ” | 30-6-59 |
| 62. | ” | 3-7-59 |

| | | |
|---|---|---|
| 63. | తు॥ వెంకటరామయ్య | 21-7-59 |
| 64. | ” | 23-7-59 |
| 65. | ” | 29-8-59 . |
| 66. | ” | 17-11-59 |
| 67. | ” | 18-11-59 |
| 68. | ” | 24-11-59 |
| 69. | ” | 20-2-61 |
| 70. | ” | 11-12-61 |
| 71. | చలం | 27-1-62 |
| 72. | తు॥ వెంకటరామయ్య | 11-8-62 |
| 73. | కాళూరి నర్సింగరావు | 10-6-65 |
| 74. | ద్వారం | 23-11-66 |
| 75. | తు॥ వెంకటరామయ్య | 1966 |
| 76. | PAS | 19-12-67 |
| 77. | దిగంబర కవులకి | 17-10-68 |
| 78. | ” | 11-11-68 |
| 79. | PAS | 18-8-69 |
| 80. | CP | 16-12-69 |
| 81. | CP | 20-12-69 |
| 82. | సోమసుందర్ | 18-8-69 |
| 83. | నిఖిలేశ్వర్ | 3-1-70 |
| 84. | CP | 11-6-70 |
| 85. | నిఖిల్ | 7-7-70 |
| 86. | Cp | 17-8-70 |
| 87. | నిఖిల్ | 21-8-70 |
| 88. | ” | 29-9-70 |
| 89. | ” | 1-12-70 |
| 90. | ” | 5-12-70 |
| 91. | RVS | 9-12-70 |
| 92. | నిఖిల్ | 14-12-70 |
| 93. | ” | 21-12-70 |
| 94. | ” | 4-1-71 |
| 95. | CP | 18-1-71 |
| 96. | నిఖిల్ | 20-3-71 |
| 97. | KVR | 23-3-71 |
| 98. | ” | 1-4-71 |
| 99. | ” | 5-4-71 |
| 100. | ” | 17-4-71 |
| 101. | ” | 21-4-71 |
| 102. | ” | 24-6-71 |
| 103. | మంగెన గంగాధరరావు | 12-7-71 |
| 104. | నిఖిల్ | 28-7-71 |
| 105. | ” | 20-10-71 |
| 106. | ద్వారం బలభద్రరావు | 4-7-72 |
| 107. | ఆంధ్రజ్యోతి | 6-11-72 |
| 108. | నిఖిల్ | 8-1-73 |
| 109. | ” | 8-1-73 |
| 110. | ” | 12-1-73 |
| 111. | ” | 20-1-73 |
| 112. | కె.వి.ఆర్ | 23-1-73 |
| 113. | ” | 25-1-73 |
| 114. | నిఖిల్ | 31-1-73 |
| 115. | CP | 1-2-73 |
| 116. | ” | 17-2-73 |
| 117. | నిఖిల్ | 8-3-73 |
| 118. | ” | 16-3-73 |
| 119. | శేషేంద్రశర్మ | 16-3-73 |
| 120. | KVR | 4-4-73 |
| 121. | ” | 10-4-73 |
| 122. | Seshan | 10-4-73 |
| 123. | CP | 23-4-73 |
| 124. | ” | 18-5-73 |
| 125. | ” | 29-6-73 |
| 126. | ” | 10-7-73 |
| 127. | KVR | 12-12-73 |
| 128. | KVR | 18-12-73 |

129 నిఖిల్ 28-2-75
130. జలగం 1975
131. Seshen 8-8-75
132 TKB 20-8-75
133. " 27-9-75
134. " 4-10-75
135. Seshen 23-10-75
136. " 30-10-75
137. TKB 6-1-76
138. బూదేశ్వర్రావు 11-7-76
139. " 20-9-77
140. Seshen & Indira 6-4-77
141. CP 26-12-77
142. " 18-4-79
143. బూదేశ్వర్రావు 6-6-79
144. KVR 17-10-79
145. " 9-1-80
146. " 8-2-80
147. CP 7-4-80
148. KVR 23-4-80
149. " 29-4-80
150. " 9-5-80
151. " 29-5-80
152. CP 31-5-80
153. KVR 22-7-80
154. CP 1-11-80
155. KVR 12-11-80
156. KVR 5-3-81
157. CP 6-4-81
158. " 8-5-81
159. " 13-5-81
160. " 16-5-81
161. " 13-6-81
162. స్వాతిబలరాం 7-10-81
163. పురాణం 23-10-81
164 రమణచంద్ 18-11-81
165. CP 1-12-81
166. బూదేశ్వ్రావ్ 20-2-82
167. రమణచంద్ 18-3-82
168. CP 21-3-82
169. " 2-4-82
170. రమణచంద్ 23-4-82
171. ఛీఛీ 23-4-82
172. బూదేశ్వ్రావు 5-5-82
173. CP 27-5-82
174. రమణచంద్ 7-7-82
175. CP 29-7-82
176. బూదేశ్వ్రావ్ 29-8-82
177. రమణచంద్ 4-9-82
178. CP 4-9-82
179. మానేపల్లి 16-11-82
180. CP 6-1-83
181. నారాయణ్రావు 27-1-83
182. రమణచంద్ 18-2-83
183. మానేపల్లి 10-3-83
184. " 17-3-83
185. " 17-3-83
186. CP 19-3-83

# 1986 నుంచి 1999
# విరసం ప్రచురించిన
# శ్రీశ్రీ సాహిత్య సర్వస్వం

1. పరిణయ రహస్యం, ప్రభవ
2. అనువాద కథలు
3. అనువాద నవలలు
4. అనువాద నాటకాలు
5. మహా ప్రస్థానం
6. వారం వారం
7. 1+1=1 (రేడియో నాటికలు)
8. చరమరాత్రి
9. మన గురజాడ
10. ఖడ్గ సృష్టి
11. జాబులు
12. రెక్కవిప్పిన రివల్యూషన్
13. చైనా యానం
14. సిప్రాలి
15. మరో ప్రస్థానం
16. వ్యూలు, రివ్యూలు
17. వ్యాసాలు
18. ఉపన్యాసాలు
19. ప్రజ
20. అనంతం

---

# విజ్ఞప్తి

మహాకవి శ్రీశ్రీ సంపూర్ణ రచనలని 20 సంపుటాలుగా విప్లవ రచయితల సంఘం ప్రచురిస్తోంది. 1986లో ప్రారంభించిన యీ పనిని 1999 డిసెంబర్ కల్లా ముగించాం. ఎంతోమంది సాహితీ మిత్రులు ఉదారంగా ఆదుకొన్నప్పటికి ఎన్నో లక్షల రూపాయల అప్పు పేరుకు పోయింది. నయాపైసాతో సహా అందరి అప్పు తీర్చేవరకూ మేం మావంతు కృషిని కొనసాగిస్తూనే వుంటాం. ఈ సందర్భంగా అభిమానులకో విజ్ఞప్తి చేస్తున్నాం.

విరసం ప్రచురించిన శ్రీశ్రీ రచనలు కొని చదవండి. ఈ పుస్తకాలు మీకు తెలిసిన నలుగురితో కొనిపించండి. ఇదే మీరిచ్చే కొండంత అండ. శ్రీశ్రీ రచనలు కూడా వెయ్యి ప్రతులు వేసి అమ్ముకోలేకపోవడం మన దురదృష్టం.

ఈ పరిస్థితిని మనందరం కలిసి మారుద్దాం. ఇందుకు మీ ప్రయత్న పూర్వక సహకారాన్ని, స్నేహ హస్తాన్ని ఆశిస్తున్నాం.

విశాఖపట్నం
15.12.1999

చలసాని ప్రసాద్

## శ్రీశ్రీ జీవితంలో తారీఖులు - దస్తావేజులు

| | | |
|---|---|---|
| 1910, ఏప్రిల్ 30 | - | పుట్టుక |
| 1911 | - | కన్నతల్లి అప్పన్నకొండ మరణం |
| 1915 | - | అక్షరాభ్యాసం, ఉపనయనం, ఎలిమెంటరీ స్కూలు |
| 1918 | - | ఓ కందపద్యం, గోకులాలు - డిటెక్టివ్ నవల |
| 1919 | - | జగన్మిత్ర నాటక సమాజంలో బాలపాత్రలు |
| 1920 | - | వీరసింహ విజయసింహులు - నవల (అముద్రితం) |
| 1922 | - | సావిత్రీ సత్యవంతులు - పద్యనాటకం (అముద్రితం) |
| 1924 | - | సవతితల్లి సుభద్రమ్మ మరణం |
| 1924 | - | పరిణయరహస్యం ప్రచురణ |
| 1925 | - | బస్బెల్సీ వెంకటరమణమ్మతో పెళ్ళి |
| 1926, మే 6 | - | పురిపండాతో కలిసి కవితా సమితి స్థాపన |
| 1928 | - | ప్రభవ (ఖండకావ్యం) ప్రచురణ |
| 1928-30 | - | మద్రాసులో బి.ఏ. |
| 1929 | - | సుప్తాస్థికలు (గేయ రచన) |
| 1930 | - | అరువై మూడు రోజుల టైఫాయిడ్ |
| 1931-33 | - | ఎవిఎన్ కాలేజీలో డిమాన్‌స్ట్రేటర్ ఉద్యోగం |
| 1933, జూన్ 2 | - | జయభేరి (గేయం) రచన |
| 1934, ఏప్రిల్ 12 | - | మహాప్రస్థానం (గేయం) రచన |
| 1937, జులై 23 | - | కొంపెల్ల జనార్ధనరావు మరణం |
| 1938-42 | - | ఆంధ్రప్రభలో ఉద్యోగం |
| 1942-43 | - | ఆలిండియా రేడియోలో ఉద్యోగం |
| 1943 | - | లక్నోలో మిలటరీ ఉద్యోగం |
| 1943 ఫిబ్రవరి | - | అరసం స్థాపన |
| 1945 | - | 'నటాలి' నాటక కంపెనీలో ఉద్యోగం |
| 1945 | - | తండ్రి మరణం |
| 1948 | - | సినీరంగ ప్రవేశం |
| 1948-50 | - | 'ఆనందవాణి'లో ఉద్యోగం |
| 1949 | - | 'ఆహుతి' (డబ్బింగ్ సినిమా) రచన |
| 1949 | - | పెంపుడు కూతురు - పేరు లెనినా |
| 1950 జూన్ | - | మహాప్రస్థానం పుస్తకం ప్రచురణ |
| 1953 ఏప్రిల్ | - | ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఎం.ఎల్.సి |
| 1954 నవంబర్, 55 జనవరి | - | రష్యా తొలి పర్యటన |

| | | |
|---|---|---|
| 1955 ఫిబ్రవరి | - | ఆంధ్రలో మధ్యంతర ఎన్నికలు |
| 1955 ఫిబ్రవరి-మార్చి | - | మతి చలనం |
| 1956 | - | సరోజతో వివాహం |
| 1966 ఫిబ్రవరి | - | ఖడ్గసృష్టి ప్రచురణ |
| 1966 డిశెంబర్ | - | సోవియట్ భూమి అవార్డు ఇస్కస్ సన్మానం |
| 1967 | - | రెండోసారి రష్యా పర్యటన |
| 1970 ఫిబ్రవరి1 | - | విశాఖపట్టణంలో శ్రీశ్రీ సన్మానం, శ్రీశ్రీ సాహిత్య సంపుటాలు 6 ప్రచురణ |
| 1970 జులై 4 | - | విరసం స్థాపన |
| 1970 అక్టోబర్ 8, 9 | - | విరసం తొలి మహాసభలు, ఖమ్మం |
| 1973 ఫిబ్రవరి | - | కేంద్రసాహిత్య అకాడమీ అవార్డు |
| 1973 మే, 15 | - | మొదటి భార్య మరణం |
| 1975 ఏప్రిల్, 13 | - | ప్రపంచ తెలుగు మహాసభల (హైదరాబాదు) బహిష్కరణ, అరెస్టు, విడుదల |
| 1976, డిశెంబర్ | - | చైనా పర్యటన |
| 1977 జూన్ 10 | - | విరసం అధ్యక్షుడిగా తొలగింపు, సాధారణ సభ్యునిగా కొనసాగింపు |
| 1979 నవంబర్ 19 | - | రాజాలక్ష్మీ ఫౌండేషన్ తొలి అవార్డు |
| 1980 మార్చి 2 | - | సప్తతి సభ, కాకినాడ |
| 1980 జూన్ 14 | - | విరసం నుంచి తొలగింపు |
| జులై 3 | - | రాజీనామా ఉపసంహరణ |
| జులై 23 | - | 'నా శాశ్వత చిరునామా విరసం' పత్రికా ప్రకటన |
| 1980 సెప్టెంబర్ | - | లండన్ పర్యటన |
| 1981 | - | అమెరికా పర్యటన |
| 1981 అక్టోబర్ 8,9 | - | గుడివాడ విరసం సాహిత్య పాఠశాల |
| 1983 జనవరి 12,13 | - | విజయవాడ విరసం సాహిత్య పాఠశాల |
| 1983ఏప్రిల్ 8, 9 | - | నల్గొండ జిల్లా రచయితల సభలు |
| 1983 జూన్ 15 | - | మరణం |



## 1

Dear అప్పలస్వామి గారు,

మద్రాస్

20-7-1940

నేను చాలా గిల్టీగా ఫీలవుతూ ఈ ఉత్తరం రాస్తున్నాను మీకు జవాబు వ్రాయలేదంటే నన్ను నేను నమ్మలేకపోతున్నాను. ఏదో నిస్త్రాణ నన్ను ఆవరించింది. ఏ పత్రికలో అయినా నన్ను చూశారా? మౌనం. అంతా మౌనం. ఇదీ నా పరిస్థితి.

ఇది త్వరలో మారుతుందేమో అని నా నమ్మకం. వెంటనే జవాబు రాయండి. చాలా సంగతులున్నాయి చెప్పవలసినవి. ఈ వుత్తరం అందదేమో అని వ్రాయలేదు. జలసూత్రం రుక్మిణీ నాథశాస్త్రి ఇక్కడ ఉన్నాడు. నారాయణబాబు ఇక్కడ ఉన్నాడు. చాలా తలంపులు పరిపక్వానికి వచ్చేటట్టు ఉన్నాయి. ఘాటయిన ఒక సంచికకు hot అయిన రచన ఒకటి పంపించండి. లేదా తయారు చేశాననైనా రాయండి. అంతా తర్వాత explain చేస్తాను.

నా గురించి మీరు కల్పించుకున్న బొమ్మలు వొట్టి నీడలు. నేనేమీ మారలేదు.

ఆంధ్రప్రభ ఆఫీస్

100 మౌంట్‌రోడ్, మద్రాసు

శ్రీశ్రీ

## 2

మద్రాసు

పాఠక మహాశయా !

1943

ఆరుద్ర ఉత్తరాలన్నీ శ్రీశ్రీ జాగ్రత్త చేశాడు గాని శ్రీశ్రీ ఉత్తరాలని చాలా మట్టుకు ఆరుద్ర (శంకరం) జారించేశాడు. ఇది అంతగా విచారించదగ్గ విషయం కాదనే శ్రీశ్రీ ఉద్దేశ్యంతో ఆరుద్ర ఏకీభవించలేదనే ప్రకటించమంటున్నాడు.

ఇట్లు

విధేయుడు

శ్రీశ్రీ

## 3

లక్నో

ఆరుద్రకి

19-10-43

**Dear శంకరం,**

నీ ఉత్తరం నాలుగైదు రోజుల క్రిందటే అందింది. అయితే ఏరోజుకారోజు ఇక్కడ నుంచి transfer అవుతుందేమో అనుకుంటూ జవాబు రాయలేదు. Transfer అయినప్పుడు మళ్లా ఉత్తరం రాస్తాను. ఇప్పటిమట్టుకు నా correct address ఇది.

Sri Sri V.C.O. Laboratory assistant No.2, I.A.M.C. Training & Depot Center, Dilkusha, Lucknow.

Basic Training నెళ్ళాళ్ళని పేరు. ఇక్కడకు నేను వచ్చి మూడునెలలు అవుతుంది. Technical training కి ఎక్కడకి పంపుతారో తెలియదు. అది పూర్తయిన తర్వాత తెలుస్తుంది. 135

రూపాయలిస్తారట. ప్రస్తుతం 75రు. మాత్రమే. ఇక్కడ నా బ్రతుకుకూడా బాగానేవుంది అయితే శరీరం పనిచేస్తోంది కాని మెదడుకి తాళం పడింది. పది పదిహేను పౌన్ల బరువు హెచ్చాను. ఒంట్లో ఆరోగ్యముగా వుంటున్నది చదువు బంద్ అయిపోయింది. రాత అంతకన్న. నువ్వు కొన్న పుస్తకం Strand Magazine కాదు కద? అందులో camouflage మీద Salvador Dali ఒక మంచి వ్యాసం రాశాడు. మనస్సు కుదిరితే నేనొక "నవలిక" రాయాలనుకొంటున్నాను "హంసతో ఆరు నెలలు" అని ..కి గాని మరెవ్వరికిగాని ఉత్తరాలు రాయలేదు. ఒక స్థాయి కుదిరితేగాని ఏపని చెయ్యడానికి తోచకుండా వుంది. ఇక్కడ తెల్లారగట్ల చలి ప్రారంభిస్తుంది. పగళ్ళుమాత్రం నెగళ్ళ. మున్ముందు చలి విజృంభించుతుంది ఏమైనా ఢిల్లీలో కిందటి చలికాలం భరించిన నేను దేన్కైనా సిద్ధంగానే వున్నాను. ఇక్కడనుంచి త్వరలోనే ఇంకోచోటికి పోవలసి వుంటుంది. నీ జీతం ఎంత? ఉత్తరంలో సరిగా కనబడలేదు. చా.సో. కి రాస్తే నా గురించి రాయి. క్షమాపణలతో త్వరలో అందరికి ఉత్తరాలు రాస్తాను. 'అశాంతి' ప్రస్తుతానికి Cold Storage లో పడేశాను. మదరాసులో బాంబులుపడ్డ సమాచారం పేపర్ద్వారా తెలిసింది. ఇంకా భోగట్టాలు తెలియలేదు. నువ్వు తరుచు వుత్తరాలు రాస్తూవుండు. ఇక్కడ ఊరికి మూడుమైళ్ళ దూరంలో వున్నాను. డేరాలలో జీవితం. ఒక్కొక్క tent లో నలుగురం. తెల్లారగట్టే P.T. తర్వాత టీ. ఉస్కేబాద్ Parade, పిమ్మట First Aid మీదా Hygiene మీదా పాఠాలు, తిండి, నిద్ర, afternoon tea మళ్ళా Parade. ఏడు గంటలకి తిండి. Back to the Tents. ఇది ఇక్కడి జీవితం. సుమారు మూణ్ణెళ్ళనుంచి ఇదే. Routine. శనివారం ½ సెలవు. ఆదివారం అంతా సెలవు. రెణ్ణెళ్ళకిందట ఇక్కడ Lucknow నుంచి University ఆంధ్ర సంఘం నన్ను ఆహ్వానించింది. చిన్న ఉపన్యాసం గీతికా పఠనం చేశాను. బహుశ military discipline కి భంగం అనుకుంటాను. అయితే అప్పుడు హాస్పిటల్లో వున్నాను-మలేరియాతో ఒక 15 రోజులు ఆసుపత్రిలో వుండి తర్వాత మళ్ళా "దినములు పరస్పర ప్రతిధ్వనులు". ఇంతతో ముగిస్తున్నాను. అమ్మడు విశాఖపట్టణంలో వుంది.

శ్రీరంగం శ్రీనివాసరావు

---

*1. స్ట్రాండ్ మాగజైను (1891-1950) :- ఇంగ్లీషు సాహిత్య మాసపత్రిక. సర్‌జార్జి న్యూనెస్ స్థాపించాడు. ప్రచురణ కర్త కూడా. సర్.ఆర్థర్ కానన్ డాయల్ రాసిన 'షెర్లాక్‌హోమ్స్' కథలు తొలిసారి ఇందులో అచ్చుయ్యాయి. హెచ్.జి. వెల్స్ లాంటి ప్రసిద్ధ రచయితలు కూడా ఈ పత్రికలో రాసేవారు.*

---

# 4

Madras

***17-6-45***

*పులిపండా అప్పలస్వామికి*

***ఏమండోయ్ పులిపంజాగారూ***

పులిపంజా ఆరుద్ర మీకు పెట్టిన పేరు. బాగుంది కాదూ అని అడిగి బాగుందని నేనే ప్రత్యుత్తరం ఇచ్చేస్తున్నాను. అదేమిటి? మీరు రాయని ఉత్తరాలే అందుతూ వుంటే రాసినవి అందకపోవడమా? పాపం, సెగ సంకటాచారిగారికి జవాబే రాశాను కాను సుమండీ. భోగట్టా మాత్రం చేశాను లెండి. రక్షరేకులు తయారు చేస్తారు. కాని ముందుగా డబ్బు చెల్లించాలట. వీపీలు పంపడానికి వాళ్ళే మన్నా వీపీలా? పదో, పన్నెండో అవుతుంది. (రూపాయలు! ఇప్పడీ ఉత్తరం రాస్తున్న టైము కాదు. ఇవాళ రాత్రి రాస్తూ రేపటి తారీఖు వేశాను. మీదాకా ఈ ఉత్తరం చేరేసరికి అది మొన్నయి పోగలదు)

నేను ఆనందవాణి లోంచి నిష్క్రమించాను సొంత పత్రిక పెట్టాలని వుంది. "ధ్వని"అని కవుల కోసం, కవిత్వం కోసం. డబ్బు లేదు. పుట్టించగలనని ధైర్యం మాత్రం ఉంది. వివరాలు సావకాశంగా రాస్తాను. సుమారు 2వేల రూపాయలైనా ఉంటే ధైర్యం చేసి ప్రారంభించవచ్చును నా "మహాప్రస్థానం" అచ్చు వెయ్యాలి కొత్త ఉద్యమం ప్రారంభించాలి. నన్ను నేనెక్కడో పారేసుకున్నాను. తెగ వెతుకుతున్నాను.

కృష్ణశాస్త్రి ఇక్కడే. బి.యన్.రెడ్డి దగ్గర కొలువు. మీరు రాలేదని చక్రపాణి ఏమీ అనుకోలేదు. ఆంధ్రజ్యోతి రెండు సంచికలు వచ్చాయి మూడో సంచికలో నా మువ్వ శతకప్పద్యాలు రావచ్చు. రెండో పది పూర్తి చేశాను. ఒకనాటి రాత్రి నే స్వప్న కుటీరము షికార్లు పోదొడగి నాడ సిరిసిరిమువ్వా. మునుహరిహరనాథుడు తిక్కనగారికి కలల దారి కనపడినట్లే మన చక్రపాణి రాణించెను నాదు స్వప్నసీమ సిరిసిరిమువ్వా. ఇత్యాదయః. సంపాదకుడు కవితో అంటాడు! *"నీకొక సిగరెట్టిస్తా, నాకొక శతకమ్ము వ్రాసి నయముగనిమ్మా, త్రైకాల్యస్థాయిగ నీ శ్రీశ్రీ కావ్యము వరలునోయి సిరిసిరిభాయీ"* అని!

మరిన్నీ పొగుడుతాడు : నర వానర కిన్నర ఖేచర దానవ యక్ష సిద్ధ సాధ్యా సాధ్యాతి రథ మహారథులు భవత్ స్థిరకీర్తిని పొగుడుతారు సిరిసిరిగారూ!

నీలాంటి వాళ్ళతోనే ముందు ముందు కేగును సుమ్మా అలస్యమెందు కిక నీక్ష్వేళారుత మందుకొనుము సిరిసిరినేస్తం!

భారద్వాజస గోత్రుడ వారబ్ధ నటేశ తాండవాడంబర మంజీరారవాళులన నస్మేరా ననమూర్తి నీవు సిరిసిరిరావూ!

వాగ్నేతవునీవె వాగ్ప్యానత లేల మహాగ్రాగ్ప్య ర్యేధరము నీవె, అమృత హిమానీ రుగ్ప్యగ్రోధము నీవె, అస్పృగ్ప్య త్య గురుండ నీవె సిరిసిరిసుకవీ!

( గ్న$^{1}$. గ్వ్య$^{2}$. గ్వ్య$^{2}$. గ్న$^{1}$) $a^1$, $b^2$, $b^2$, $a^1$. అనే ప్రాస పద్ధతి ఇంగ్లీషులో ఒప్పుకుంటారు. తెలుగులో అయితే గ్న, లేదా గ్వ్య అయి ఉండాలి. హల్లులు మూడున్నప్పుడు రెండు హల్లుల ప్రాస కూడా వెయ్యడం పండిత సమ్మతమే. వాగ్గర్వ, వాగ్యర్గ అని రెండు హల్లులతోనే స్వాతంత్ర్యం తీసుకున్నాడు తెనాలి రామకృష్ణ కవిచంద్ర సాంద్రకీర్తీశ్వరుడు.

అయినా ఎందుకేనా మంచిదని రెండు పాఠాంతరాలు (అన్నీ గ్న ఒకటీ, అన్నీ గ్వ్య ఒకటీ) తయారుచేశాను.

వాగ్నేతృడ వీవె కరాళాగ్ని లాధరము నీవె అమలి నమిహికా
రుగ్నవ్య కీర్తివీవె అస్పృగ్నర్తన గురుడ వీవె సిరిసిరిమువ్వా!

వాజ్నేతృడు అని, రుజ్నవ్య అని, స్పృజ్నర్తన అని డాబు చేశాను.

వాగ్ప్యానత నీకేమి మహాగ్వ్యవ నీ ధరమ వీవె అమృత హిమానీ
రుగ్వ్యగ్రోధము నీవె అస్పృగ్వ్యాస విలాసి నీవె
సిరిసిరిమువ్వా

ఈ మూడింటిలో ఎవరికి కావలసిన పద్యం వాళ్ళు ఎంచుకోవచ్చును. మిగిలిన రెండింటినీ విడిచివెయ్యాలనే షరతుమీద.

ఆఖరికి ఇలా మన సరస్వతిని గాడిదమీద ఊరేగించవలసిందేనా? రేడియోకి నాటకాలు కావాలట.

500, 250, 100 రూపాయలు వరుసగా మూడు బహుమతులు.

అన్నీ నేనే లాక్కోవాలని అరడజను నాటకాలు తయారు చేస్తున్నాను. మీరు కూడా రాయండి. తృణమో, పణమో హరిద్వారంలో మఠానికే! (కన్యాశుల్కంలో బైరాగి చెప్పినట్టు). ఆరుద్రని కూడా రాయమంటున్నాను. ఆరుద్ర ఎడ్రసిస్తున్నాను. యుద్ధం అయిపోయింది. వచ్చేస్తాడనుకుంటా.

మనం బతికివున్నట్లు అసందిగ్ధంగా ప్రకటించవలసిన అవసరం వుంది లేకపోతే గిడుగురామ్మూర్తీ, జనార్దనరావూ కోప్పడతారు. మనం కవులమై వుండి కూడా కప్పల లాగ బతకడం నాకిష్టం లేదు. గరిసెల కొద్దీ నిరుత్సాహాన్ని కాలం తోడిపోస్తూనే ఉంటుంది. దానితోకకి నిప్పంటించి లంకా దహనం చేస్తే పరశురాముడికి ప్రీతి. మీరు చెన్నపట్టణం వస్తే ధ్వని పుట్టించి బతుకుదాం...

1nd/46929/Ac/Sastri B.S.
I.A.F. Record Officer
C/o. RAF Post, BOMBAY

Yours
**Sri : Sri :**

*1. సెగసంకటాచారి - తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి (1892-1977) ని శ్రీశ్రీ కోపంగా ఈ పేరుతో పిలచేవాడు. సాహితీ సమితి స్థాపకుల్లో ఒకడు. సాహితి పత్రిక సంపాదకుడు. ప్రసిద్ధ ఖండకావ్యం 'హృదయేశ్వరి' 1938 లో వెలువడింది.*

*2. ధ్వని శ్రీశ్రీ నడుపుదామనుకున్న తెలుగు కవితా పత్రిక. అయితే అది కలగానే మిగిలిపోయింది.*

# 5

Madras
*26-6-45*

*పురిపండా అప్పల స్వామికి*

Dear బ్రదర్జీ

2 పైజామాలు, 2 చొక్కాలు, 2 చిరెండ వాసన ఒకట్లు. మొత్తం ఒకటే మూట. మీ ఉత్తరం అందిందనడానికి దాఖలాగా మీ పాటకి "ఆకాశరామన్న ఉత్తరం" అనే శీర్షం అంటించి ఆనందవాణిలో అచ్చేత్తబోతున్నాం (బహువచన సంపాదకుడు).

ముద్దాయి విశ్వనాథం మీకో లేఖ. దాన్ని సింహాచలానికి రవాణా చేశాను. మీరు వెళ్ళారు. ఆరుద్ర వచ్చాడు. ఇవాళ రాత్రి పఠాభి తో కాస్మాపాలిటన్ క్లబ్బులో విందు.

నిన్న గోరాశాస్త్రి ఒక ఉత్తరం వ్రాశాడు. ఇవాళతనికి జవాబు వ్రాస్తున్నాను. మీరు అతని దగ్గర David Gascoyne విరచిత Short Survey of Surrealism తీసుకోవడానికి ఈ ఉత్తరం ఉపకరిస్తుందని ఆశిస్తున్నాను.

*అందంగా నవరస ని*
order *ష్యందంగా పవిత్ర హృదయ సంస్పందంగా*
placed *కందాలోక వంద రచిం*
*చిందికి మననయ్యో నాకు సిరిసిరిమువ్వా.*
*మళ్ళా ఇన్నాళ్ళకి ఇ*
order *న్నేళ్ళకి పద్యాలు వ్రాయుటిది ఎట్లన్నన్*
cancelled *పళ్ళూడిన ముసిలిది కు*
*చ్చిళ్ళన్ సవరించినట్లు సిరిసిరిమువ్వా.*

ఈ ఉత్తరం విశాఖపట్నానికే పోస్టు చేస్తున్నాను. ఆలస్యంగా అందుతుందనే అచంచల విశ్వాసంతో.

మీలో కొత్తగా కదలుతూన్న కావ్యనిర్ఝరిని నిర్నిరోధంగా ప్రవహించనివ్వండి. నదులంటు ఉంటే వాటికి సావకాశంగా ఆనకట్టలు నిర్మించుకోవచ్చు. సాహిత్య క్షేత్రానికి వీటివల్ల పుష్టే కాని నష్టిలేదు. కాదన్న వాణ్ణి గాడిదలు కరుస్తాయి.

"నా చేత వెయ్యి పచ్చి వంకాయలు తినిపించా"రని ప్రతాపరుద్రీయంలో పిచ్చివాడంటాడు ఆ పిచ్చివాడు ఎవరనుకున్నారు. వేదం వెంకటరాయ శాస్త్రులే. "అప్పిచ్చువాడు వైద్యుడు!"

కన్నయ్య పంతులుగారు పంపించిన వందనాలను పొట్లం కట్టి జాగ్రత్తగా దాచుకున్నాను. కొన్నాళ్ళకి చక్రవడ్డీ మీద ఈ "వంద" నాకే "లక్ష"ణాలు కావచ్చునని ధీమా.

"దేవు"ని మౌనం షడ్భాషా నిఘంటువంత బరువుగా ఉంది

బెజవాడ నడిగానని చెప్పే ఉంటారు. అక్కడ మకాం చేశాననీ, భూత భవిష్యద్వర్తమాన, స్వీయ, పరకీయ గ్రంథరాజాలను ప్రకటించడానికి కాగితం సేకరించాననీ ముద్దుకృష్ణ వ్రాశాడు. అతణ్ణి కలుసుకునే ఉంటారనుకుంటాను.

ఉంటాననుకుంటాను

Sri Sri

*1. డేవిడ్ గాస్కొయిన్ (1916-?) .- ఇంగ్లీషుకవి. అతని పదహారో యేటనే (1932) 'రోమన్ బాల్కనీ' అనే కవితా సంపుటి వెలువరించాడు. 'ఏ షార్ట్ హిస్టరీ ఆఫ్ సర్రియలిజమ్' అనే పుస్తకం 1935లో వెలువడింది. అధివాస్తవిక కవిత్వాన్ని బాగా ప్రచారం చేశాడు. ఐరోపా సాహిత్యంతో గాఢమైన పరిచయం ఉంది.*

## 6

పెదపూడి

Dear అప్పలస్వామిగారు

30-5-46

మీ ఉత్తరం అందింది. సంగీత పాఠశాలకాదు. సాహిత్య పాఠశాల. నేను బహుశా రెండు మూడు రోజుల్లో ఒక విసురు విశాఖపట్నానికిరావచ్చు భార్యా సమేతంగా. ఈ లోపున ఒక చిన్న ఉపకారం చేసి పెడతారూ? తెల్లచీరలు 5 గజాలవి మూడు చీరలు తీసి ఉంచుతారూ? మేము వచ్చి విడిపించుకుంటాము. మీ వారిని చూడడం నిమిత్తమే ఈ ప్రయాణం మా ఆవిడ తలపెట్టింది. మా బంధువర్గంవారు ఎవరైనా కనబడితే మేము వస్తున్నట్లు చెప్పండి. ద్వారం జగన్నాధరావుకి కూడా. ఆరుద్రతో కొన్నాళ్లుగా ఉత్తర ప్రత్యుత్తరాలు (పరధ్యానం కారణంగా) ఆగిపోయి మళ్లీ ఇప్పుడందుకున్నాయి. నా "వారంవారం" వ్యాసాలు గ్రంథ రూపంలో వచ్చాయి.

కాపీలు చెన్నపట్నంలో ఉండి పోయాయి.

మిగతా విషయాలు ముఖాముఖీ.

శ్రీశ్రీ

*1. పెదపూడి (గుంటూరుజిల్లా)లో ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం "ఆంధ్ర సాహిత్య పాఠశాల" ను నిర్వహించారు. 1946 మే 11న ఆవిష్కరణోత్సవం జరిగింది. మల్లంపల్లి, పంచాగ్నుల, దేవీవరప్రసాద్ రాయ్ చౌధురికూడా పాల్గొన్నారు.*

*2. 1946 జనవరిలో "వారం వారం" గ్రంథరూపం తాల్చింది. ప్రతిమా బుక్స్‌వారు ప్రచురణ కర్తలు.*

## 7

Madras

Dear అప్పలస్వామిగారు

14-6-46

తిరిగి తిరిగి మళ్లా, ఇక్కడ పడ్డాను. మళ్లా తొలినుంచీ జీవితం ప్రారంభించవలసి ఉంది. ప్రస్తుతం సముద్రపొడ్డున ఇసకలో ఓనమాలు దిద్దడమే ప్రథమ కర్తవ్యంలా కనబడుతుంది. "ధ్వని" ప్రచురణ విషయమై, లోగడ ఆపినచోట మళ్లీ అందుకుంటున్నాను. ఈ సందర్భంలో నిన్న తెన్నేటి

విశ్వనాథం గారిని కలుసుకున్నాను. భవిష్యత్తు తన ముళ్లని దాటి గులాబి రేకులు ప్రదర్శిస్తోంది. నేనైతే అన్నీ మళ్లీ ఆరంభంచేస్తూన్నాను గాని హంసపాదాలు మాత్రం జాస్తీ అయిపోతున్నాయి.

నాకింకా ఒక నిర్దిష్టమైన చిరునామా కుదరలేదు. మీ జవాబు ఆనందవాణికి గాని, లేదా C/o. నారాయణబాబు, 96 వెంకటాచల మొదలి వీధి, రాయపేట, మద్రాస్ అనిగాని వ్రాయండి.

యలమంచిలిలో రాఘవరావు గారిని కలుసుకొని వారికి మన ఉభయుల అనునయాశ్రువులూ సమర్పించాను.

మీరు విశాఖపట్టణంలో ఎన్నాళ్లుంటారు? తదనంతర కథా విధానం బెద్ది?

నేను బహుశా 20 రోజులలో విశాఖపట్టణం రావచ్చును. ఈ లోపుగా ఇక్కడ కొన్ని ముఖ్యమైన ఏర్పాట్లు చేసుకోవాలి. "ధ్వని" సందర్భంలో బహుశా ఢిల్లీకి వెళ్లవలసిన పని కూడా పడుతుందేమో?

విశాఖపట్టణం వస్తే కొంతమంది చందాదారులను కూడా చేర్చే ప్రయత్నం కానించదలచుకున్నాను. ఇందుకు మీ సహాయం ముఖ్యం.

ఉంటాను.

మీ

శ్రీశ్రీ

# 8

<u>పురిపండా అప్పలస్వామికి</u>

Hyderabad,
4-10-46

Dear PAS,

ఎక్కడో మునిగి హైద్రాబాదులో తేలిన నేను ఒక బీరు బుడ్డీ ముగించి రమ్ సేవిస్తూ ఈ ఉత్తరం రాస్తున్నాను. ఎడమనుంచి కుడికి అలవాటు పడ్డ బదుకు కుడినుంచి ఎడమను అర్థం చేసుకోవడంలో ఇంకా కొంత ఇబ్బంది భరిస్తుంది, భరిస్తున్నది. ప్రస్తుతం నేను మ.ఘ.వ. నిజాం ప్రభువువారి (మఘవ అనగా మహా ఘనత వహించిన అని అర్థం) Reforms సెక్రటేరియట్‌లో ఉద్యోగిని[1]. నెలకు 200 రూకల జీతం. ఆరు నెలలదాకా ఇలా బతకడానికి వీలుంది. ఖాసింఖాను[2] కరుణాదృష్టి వల్ల నేనూ అబ్బూరి వరద రాజేశ్వరరావూ[3] రెండు తాత్కాలికోద్యోగాలు సంపాదించాము. విశేషాలు మళ్ళీ రాస్తాను. "ధ్వని" సంగతి మరిచిపోలేదు. ఇక్కడే ఖాసింఖానుకు చెందిన ఒక ముద్రణాలయం ఉంది. ముఖ్యంగా నేనీ గ్రామానికి రావడం "ధ్వని" అచ్చు వెయ్యడానికే. "మహాప్రస్థానం" గీతాలు కూడా అచ్చొత్తించొచ్చు. మరిన్నీ తతిమ్మా ఎన్నెన్నో ఉద్దేశాలకు రూపం ఇవ్వవచ్చు. వెండియు దాము 'ఆరుద్ర' నామధేయునితో ఉత్తర ప్రత్యుత్తరంబులు జరుపుచున్నారా? తిరుపతిమౌనియు[4], కృష్ణశాస్త్రి మహర్షియు మద్రాసు మహారణ్యంబునందున్నారు.ఉంటాను.

శ్రీ.శ్రీ.

నా చిరునామా

S. Srinivasa Rao,
<u>Academy Press, 103, Alexandra Road, Secunderabad.</u>

*1. యుద్ధకాలంలో సైన్యంలో ఉద్యోగంచేసి వచ్చాక, శ్రీశ్రీ కొన్నాళ్ళు మళ్ళీ నిరుద్యోగిగా ఉండవలసి వచ్చింది. అప్పుడు తన మిత్రుడు మొహమ్మద్ ఖాసిం ఖాన్ చక్రం అడ్డువేసి, హైద్రాబాదులో నౌకరీ ఇప్పించాడు. ఆరావముత్తు అయ్యర్ తలపెట్టిన సంస్కరణలను అమలు పెట్టేందుకేర్పడిన ఆఫీసులో ఈ నౌకరి.*

*2. జనాబ్ మొహమ్మద్ ఖాసింఖాను : స్వస్థలం కొవ్వూరు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో చదివే రోజుల్లో శ్రీశ్రీతో పరిచయమూ స్నేహమూ కలిశాయి. హైదరాబాదు సంస్థానంలో ఉద్యోగం సంపాదించి, శ్రీశ్రీకి*

*అబ్బూరి వరదరాజేశ్వరరావుకి ఉద్యోగాలిప్పించాడు. శ్రీశ్రీ తొలినాటి గీతాలను (ప్రభవ) భద్రపరిచాడు. ఆంధ్ర సారస్వత పరిషత్తుకు పోటీగా తెలుగు ఎకాడమీ నడిపాడు. (1943)*

*ఖురీ అన్ - షరీఫు, కథానికా రచనలు ఖాసింఖాను కృతులు.*

*3. ఈయనకు Information శాఖలో నౌకరీ దొరికింది.*

*4. అరవిందయోగి భక్తుడు. అనేకులైన కవులకు మిత్రుడు.*

---

## 9

**Dear Appala Swamy garu**

సికింద్రాబాదు
8-1-1947

మీ ఉత్తరాలన్నీ అందుతూనే ఉన్నాయి. కాని నాకో స్థిరత్వం అంటూ లేకపోవడం చేత జవాబు వ్రాయడం పడలేదు. మీ ఆఖరి ఉత్తరంలోని విషాద వార్తకి కూడా వెంటనే సానుభూతి తెలుపలేకపోయాను. ఎప్పుడైనా గ్రహించండి. ఈ అవకాశాన్ని పురస్కరించుకొని వేదాంతాన్నీ, వైరాగ్యాన్నీ ఉపన్యసించలేను. ఇంకా మనం మిగిలి ఉన్నందుకు సంతోషిస్తూనే ఉందాం. ఈ విషాద నాటకంలో ఇంకా ఎన్ని రంగాలలో అభినయించాలో అని కనిపెట్టుకుంటూ.

ఆరుద్ర అరక్కోణంలో ఉన్నాడు. తరుచు మద్రాసు వస్తూ ఉంటాడు. ఈ మధ్యనే మద్రాసులో కలుసుకున్నాం. నా "ధ్వని" కి అనుమతి వచ్చింది. సికింద్రాబాదు నుంచి మకాం ఎత్తెయ్యాలని చూస్తున్నాను. ఏదీ నిశ్చయం లేదు. ఎందుచేతనంటే చెప్పలేను.

ఇంత ఊపిరి సలపకపోవడం నాకొక్కడికేనా అనిపిస్తుంది కాని కనిపించే ప్రతివాడూ ఏదో ఉక్కిరి బిక్కిరి అవుతున్నట్టే ఉంటాడు. బహుశా ఈ భూగోళం మీద చాలినంత ప్రాణవాయువు వున్నట్లు కనబడదు. ఎంతగా ఎవరి జోలికీ పోకుండా ఉందాం అనుకున్నా ఏమో వచ్చి కలత పెడుతూనే ఉంటాయి. అందుచేత ఈ వాక్యం పూర్తి కానంటుంది. ఉత్తరం మాత్రం ఇదివరకే పూర్తి అయింది.

Academy Press, 103, Alexandra Road,
Secunderabad (Stn.)

affectionately yours
Sri Sri

---

## 10

To
CPL B.S. Sastri [1]
RIAF Station
ARKONAM.

Madras
25-3-47

My dear Arudra,

I believe you weren't here last week end. I left Modern Cafe and shifted to Royapettah-28 Srinivasa Perumal St. Srinivasapuram. Hope you are coming here on Saturday. It is the last day of the season and I am not going to miss it?[2] 1st Encl. of course. Get as many letters[3] as you can lay your hand on . Also the [4]Rimbaud book. Have seen your Premari[5]. Wish you had reserved it for Dhvani. I have bought a new pair of glasses at 26 Rs. Come early if possible. We shall try to squeeze money from various sources.

Yours affly.
Sri.Sri.

*1. B.S. Sastri is none other than ARUDRA himself whose original name in full is Bhagavatula Sankara Sastri Related to SRI SRI by birth. ARUDRA was brought up by SRI SRI, as poet figuratively speaking. At the time at which SRI SRI wrote this letter, ARUDRA was serving in the Royal Indian Air Force station, in the rank of colonel.*

*2. A slave of many vices SRI SRI was literally crazy of horseraces and threw lots of money on horses He described the state of mind of a race-goer in an English shortstory, pubished in the REPUBLIC of Madras at that time. That story is not be traced. A Telugu version of the same is, however, available under the caption of ASWAMEDHA YAGAM.*

*3. These letters were from SRI SRI to ARUDRA and they were published in MALI of Madras at that time.*

4. రైబాడ్ - ఆర్థర్ రైబార్టు (1854-91) :- చిన్నప్పటినుంచి శిక్షణ, క్రమశిక్షణ అంటేమంట. ఆంక్షలనీ, ఆధిపత్యాన్ని నిరసించాడు. అన్నింట్లోనూ మార్పు కావాలని కోరుకునేవాడు. ఇల్లు విడిచి దూర దేశాలకి పారిపోయాడు. మొదట్లో విక్టర్ హ్యూగోనీ, బాదలేర్‌ని అనుకరించినా అటు తరువాత స్వంత గొంతుక వినిపించాడు. తన 19వ ఏటనే ' సైకలాజికల్ ఆటోబయోగ్రఫికల్ ' అనే పుస్తకం రాశాడు. ఇందులో గద్యం, పద్యం కూడా వుంది. 'ఇల్యుమినేషన్స్' అనే వచన కవిత బాగా పేరుపొందింది. సింబాలిజమ్‌మీద, సర్రియలిజం మీద ఇతని ప్రభావం వుంది.

*5. The title of a poem from ARUDRA'S pen, printed in ANANDAVANI.*

## 11

Madras

Dear Appalaswami Garu, 9-7-47

మీరు రాసిన రెండో కార్డు శిథిలరూపంలో దొరికింది (మేమెవ్వరమూ ఇంట్లో లేనప్పుడు పోష్టువాడు పడవేసిన కార్డుకి జిమ్మీ ఇచ్చిన మారురూపం). దానిని కూడబలుక్కొని చదివి సారాంశం గ్రహించాను. మీరు ఎన్నాళ్ళదాకా విశాఖపట్టణంలో ఉంటారు. 15వ తేదీని మా నాన్నగారి త్రైమాసికం అయిపోయాక నేనూ అరుద్రా వస్తాము. మా కొండమ్మని దిగబెట్టవలసి కూడా ఉంటుంది. 15వ తేదీ తరువాత ఏ తారీఖయినా నాకు వీలుగా ఉంటుంది. మీరే fix చెయ్యవచ్చును. మీ రచనలన్నీ కాపీలు ఉంచుకొని మరీ పంపుతూ ఉండండి. నాదగ్గర జాగ్రత్తగానే ఉంచుతున్నాను గాని. గోరాశాస్త్రిని కలిశారా? విశాఖపట్టణం గూడ్సు షెడ్డులో భోగట్టా చెయ్యండి. పుస్తకం తీసుకుని చదవండి. నారాయణబాబు భోగట్టా యేమైనా తెలిసిందో?

Yours

Sri.Sri.

*1. శ్రీశ్రీ తండ్రి వెంకటరమణయ్యగారు మద్రాసులో శ్రీశ్రీ దగ్గరే ఉంటూ 1945లో చనిపోయారు.*

*2. శ్రీశ్రీ సవతి తల్లి కూతురు.*

## 12

**పులిపండా !**

1947

**I must meet you.**
**Where? When? How ?**

Sri Sri

Caption for photo block
Poet and translator (the latter with his back to the camera)

1 కాప్షన్ - పురిపండా తెలుగు కవితలు, వాటికి శ్రీశ్రీ ఇంగ్లీషు అనువాదాలు కలిపి 'సౌదామిని' అనే పుస్తకం 1947 లో వెలువడింది. అద్దేపల్లి వారి ప్రచురణ పురిపండా ముఖం, శ్రీశ్రీ వీపు కనిపించేలా ఒక ఫోటో అందులో పడింది.

# 13

Madras
10-8-47

My dear PAS.

రైలు బండిలోంచి తొందరగా విసిరిన మీ ఉత్తరం, James Joyce, నా కాగితాలు etc. అందినవి. మొన్నసాయంత్రం ఆంధ్ర విజ్ఞాన సమితిలో మన కవితా సమితి సభ బాగా జరిగింది. తెన్నేటి విశ్వనాథం గారు అధ్యక్షించారు. బహుశా ఇవాళో రేపో తెలుగు దైనికాల్లో report పడవచ్చు.

Soudamini[1] మీద హిందూలో రివ్యూ పడింది. (Hindu, Sunday August 10, 1947, Page 11, Column 3) చూడండి.

మీరింకా విశాఖపట్టణంలోనే ఉన్నారనుకుంటూ ఇది వ్రాస్తున్నాను. 16 ఉదయం 8 గం॥లకి రేడియో కవి సమ్మేళనం, వినండి. శ్రీశ్రీశ్రీ జయపురాధీశ్వరుని[2] అధ్యక్షత. మీ ఉత్తరం చూసుకుని మళ్ళీ జవాబు రాస్తున్నాను. బహుశా నెలాఖరు లోపున విశాఖపట్టణం వస్తానేమో. కాని, మన బహుశా "కేవలం బహుశా" అని మీకు వేరే చెప్పాలా?

ఇంతే సంగతులు. చిత్తగించవలెను

ఆరుద్ర వ్రాలు

Yours affly.

Sri.Sri.

1. 'సౌదామిని' అనేది పురిపండా అప్పల స్వామిగారి గేయ సంకలనం. తెలుగు గేయాలకు శ్రీశ్రీ చేసిన ఆంగ్లానువాదాలు కూడా అందులోనే అచ్చయ్యాయి. ప్రచురణకర్తలు అద్దేపల్లి అండ్ కో. రాజమండ్రి (1947)

2. విక్రమ దేవవర్మ

# 14

Madras
27-10-1947

**అబ్బూరి వరదరాజేశ్వరరావుకి**

My dear Vardha !

I too have been frantically beating my wings in the void to get a connection. According to the law of crow-Palmyra (కాకతాళీయం) I hit here upon your awaiting letter. It has been so champagnimagnificent. Remit the rhino, boy, send me the sordid pelf ("ఏం చేస్తాం! కొంచెం చిల్లర ఖర్చుంది" - రామప్పంతులు).

This is the present address for your information and immediate action.

**528, Pycrofts Road,Triplicane, Madras.**

As for DHVANI (note the V for Victory or Vacillation) it continues to torment me. The gentleman who promised me a thousand rupees has let me

down in the 'Thick' of time. I have paper permit. I made the declaration. I hav poems and articles. (by the way, send your శీతోష్ణస్థితి. Arudra is writing also.)

I am writing some, myself, poems and prose on poetry.

Bullayya is publishing సిరిసిరిమువ్వ. Do please write to your father re: tl introductory verses Arudra and I have commenced రుక్కుటేశ్వర శతకం w apoligies to Varada.

*వచియించె వరద లోగడ*
*రచింతునని రుక్కుటేశ్వర శతకమును, మే*
*మచలిత ధైర్యమ్మున నా*
*మ చౌర్య మొనరించినాము మన్నించు జరూ!*

Yours affly.
Sri.Sri.

## 15

Madras
13-12-47

My dear Puripanda,

మీ ఉత్తరం అందింది. దీనికి ప్రత్యేకంగా రాయలేకపోయాను. ఆయన పంపిన తేనె అందినది. ఈ మధ్య ఇక్కడ తెన్నేటి విశ్వనాథం గారికి స్థానిక కవితా సమితి తరఫున భాషించాను. ఒక విందు ఇచ్చాడు. చక్కగా జరిగింది.

ఇక రూపవాణి గొడవ. త్వరలో రూపవాణి సంపాదకుడి మీద క్రిమినల్ చర్య తీసుకుంటున్నాను. ఈ వ్యవహారంలో నారాయణ బాబు ద్రోహంగా ప్రవర్తిస్తున్నాడేమో అనే అనుమానం నాకుంది. భయంకరమైన అసూయతో వాడు బాధపడుతున్నాడు. అందరి దగ్గరా విచ్చలవిడిగా నన్ను తూలనాడుతున్నాడు. నన్ను తిట్టడం వల్ల తనకి ఆధిక్యం వస్తుందని భ్రమపడుతున్నాడేమో నాకు తెలియదు మీరు విశాఖపట్టణం ఎప్పుడు వస్తారు? ఆరుద్ర కూడా నన్ను boycot చేశాడు. ఈ విధంగా నేనెవరిని ఆత్మీయంగా ఎంచుకుంటున్నానో వారే నాకు చూస్తుండగా దూరమై పోవడం నా దురదృష్టం. మీరు విశాఖపట్టణం వెళ్ళగానే ఒక సభచేసి రూపవాణి వ్రాతలను గర్హిస్తూ తీర్మానించాలి. విశాఖ పట్టణం నుంచి మద్రాసుదాకా ఇటువంటి సభలు జరగబోతున్నాయి. బెజవాడలో వరద రాజేశ్వరరావు నాకొక సన్మానం ఏర్పాటు చేసినట్టు వ్రాశాడు. అభ్యుదయ రచయితల సంఘం నాకు బాసటగా నిలుస్తుంది. గోట చిదుమ దగిన దానికి గొడ్డలి ఉపయోగిస్తున్నానేమో తెలియదు. కాని సామెతలను నమ్మకూడదు. చిన్నపామునైనా పెద్ద కర్రతో చంపాలని కూడా ఒక సామెత లేకపోలేదు.

ఈ గందర గోళంలో పడి నా "ధ్వని" పని వెనక బట్టిస్తున్నాను. అయినా ఆ విషయం కూడా అనవరతం ఆలోచిస్తూనే ఉన్నాను. ఈ విషమ పరీక్షలన్నీ నన్ను క్రుంగదీయడానికి బదులు నూతనోత్సాహాన్నిస్తున్నాయి. మళ్ళా విపులంగా రాస్తాను.

మీ
Sri Sri

## 16

Madras
*22-1-48*

*అబ్బూరి రామకృష్ణారావుకి*

Dear Master Garu!

I have shifted from 528 pycrafts Road to Adayar. Hence this delay in replying your two letters. I am giving you my present address overleaf. I shall be glad if you send me the introduction verses.

I have given your letter to be published in toto. I myself have refrained from issuing any statement, in the hope that your letter is sure to have a medicinal effect on NB. He is at present in VIZIANAGARAM. I don't know hi'll be coming over here.

Hoping this letter will find you and yours in good cheer.

Sincerely yrs
Sri Sri

## 17

Madras,
21-2-48

Dear **అప్పల స్వామిగారూ**

మీ ఉత్తరం అందింది. నా నిరుత్సాహం ఎప్పుడూ ఉంటున్నదే. నిరాశ, నిర్వేదం, అశాంతి ఇవన్నీ నా జీవితానికి ప్రధాన లక్షణాలయి కూర్చున్నాయి. అయితే వీటినన్నింటినీ ఘాటయిన ఉపేక్షా ద్రావకంలో ముంచి ఉంచుతున్నాను. అప్పుడప్పుడుకూడా నా ఉత్తరాలలో ఇవి పైకి ఉబికితే దానికంత పట్టింపు చెయ్యకండి.

ఇక ప్రస్తుత కథ : "ధ్వని" ప్రచురణకి పుణ్యకాలం మించిపోతోంది. నా paper print పై నెల 31వ తేదీకి కాలదోషం పట్టిపోతుంది. ఎలాగయినా ఒక వెయ్యి రూపాయలు పోగుచేసే ప్రయత్నంలో ఉన్నాను. అందుకే ఒక సినీమా కంపెనీకి (Netaji Productions) పాటలూ, మాటలూ వ్రాయడానికి ఒప్పుకున్నాను. కంపెనీకి డబ్బులేదు. ఇంకొక కంపెనీ వాళ్ళు నన్ను బొంబాయికి రమ్మంటున్నారు. నెల్లాళ్లుండాలట. వాళ్లేనా కొంత డబ్బిస్తే కాగితం కొనేస్తాను. బహుశా ఈ లోపున (నెలాఖరులోగా) నేను విశాఖపట్టణం వచ్చే అవకాశం ఉంది. మీరు విశాఖ పట్టణంలోనే ఉంటారా?

తక్కువంగల విషయాలు ముఖస్థంగా - బహుశా!

మీ
Sri Sri

## 18

విశాఖపట్టణం
5-5-48

Dear **అప్పల స్వామిగారూ**

రెండుసార్లు విశాఖ పట్టణం వచ్చిన్నీ మిమ్మల్ని కలుసుకోలేకపోయాను. మొదట రాజమండ్రి

కిన్నీ తర్వాత బొంబాయికిన్నీ (ఒక ఫిలిం కంపెనీ పని మీద) వెళ్లుతున్నాను. మీరు నాకు Sri Sri C/o. The Eastern 1st Production, లక్ష్మీవారపు పేట Rajahmundry అని వ్రాయ గోరుతున్నాను. దేవు క్షేమం అడిగినానని చెప్పవలెను. మీరు మీ వారందరూ సుఖులని విశ్వసిస్తున్నాను చిన్న తేనెమాట. ఇక్కడ మా ఆవిడకి మందులోకి తేనె కావాలి. C/o. మూలావీర భద్రరావు తుమ్మలపల్లి వారి వీధి అనే చిరునామాకి తేనె పంపగోరుచున్నాను. ప్రస్తుతం మట్టుకి నా ఇతర కార్యక్రమాలన్నింటినీ వాయిదా వేశాను. విపులంగా మళ్లీ ఉత్తరం రాస్తాను.

మీ

Sri Sri

# 19

బొంబాయి

Dear అప్పల స్వామిగారూ 3-7-48

ఇంకా అక్కడే ఉన్నారా? అయితే ఇది వినండి. నేను బొంబాయిలో పడ్డాను. (దిగ-లేదా ఎగ) చిరినామా వీపు మీద రాస్తున్నాను. P.E.N. ఎడ్రసు కావాలి. ఆరుద్ర కనబడుతున్నాడా? అబ్బూరి రామకృష్ణారావుగారు? వరద భోగట్టా? ఖాసింఖానుకి మళ్ళీ రాశాను. మళ్ళీ మౌనం? గొప్పవాడు. "భయమో, సిగ్గో, విచారమో?" మీకేవైనా ఉత్తరాలు రాస్తున్నాడా? మీరు రాసే జవాబులో నన్ను జ్ఞాపకం చెయ్యండి. మనస్సులో ఏముందో పైకి చెబితే బాగుంటుంది. లేకపోతే అడుక్కిపోయి కుళ్ళడం మొదలు పెడుతుంది. అది ఆరోగ్యానికి మంచిది కాదు.

జవాబు రాయండి. మళ్ళీ సుదీర్ఘంగా రాస్తాను.

Affectionetely Yrs,
Sri Sri

62 Kelu Karga, Shivaji Park
Dadar - BOMBAY

# 20

పురిపండా అప్పలస్వామికి మద్రాస్

Dear P.A.S. 1948

1. మీ ఉత్తరాలన్నీ అందినవి. Congratulations to the municipal councillor
2. దేవు పంపిన తేనె అందినది.
3. నా కొత్త Address 528, Pycroft's Road, Triplicane.

3ఎ. సౌదామిని కాపీలు ఒక్కటీ అమ్ముడుపోలేదు (శక్తివాళ్లు)

4. తతిమ్మా విషయాలు నిడివి మీద.

Yours sincerely
Sri Sri

1. పురిపండా అప్పలస్వామిగారు
విశాఖ మున్సిపల్ కౌన్సిలర్‌గా ఎన్నికయ్యారు

# 21

Madras

పురిపండా అప్పలస్వామికి

21-10-49

My dear PAS,

నేను నిన్ననే తెనాలినుంచి వచ్చాను. (ఒక హిందీ ఫిలింను తెనిగించే సందర్భం)[1] ఇక మీద ఇక్కడ ఉంటాను. అయితే ప్రస్తుతపు చిరునామా మార్చవచ్చును మార్చగానే తెలియజేస్తాను. మా అమ్మాయి పేరు "అనామిక"[2] చాలా బలహీనంగా ఉంది. ఇప్పుడు నాలుగో మాసం. మీరు విశాఖనుంచి అసురధిపా వెళతారా? వెళ్ళితే. (వెళ్ళకపోయినా ఉత్తరం ద్వారా అయినా) తేనె పంపించగోరుతాను. వరదరాజేశ్వరరావు సికింద్రాబాదులో ఉన్నాడు. చూశారా? నేను తెనాలిలో ఉండగా అక్కడికి వచ్చాడు. చెళ్ళపిళ్ళ[3] సన్మాన సందర్భంలో రామకృష్ణ రావుగారు బెజవాడ వచ్చారు. ఫోనులో మాట్లాడాను. మొన్న ఈ మధ్య గుంటూరులో ఒక విద్యార్థి సభలో మాట్లాడాను. అక్కడే దేశిరాజు కృష్ణశర్మ కనబడ్డాడు. నా "మహాప్రస్థానం" గీతాలు అచ్చు వెయ్యడం గురించి ప్రసక్తించాడు. పుణ్యఘుడియలింకా రాలేదన్నాను. నా ఫిలిం బాపతు డబ్బు త్వరలో చేతి కందుతుంది. అప్పుడు నా గీతాలు ఒక సంపుటం, కథలొక సంపుటం వెయ్యించాలని చూస్తున్నాను. "ధ్వని" తొలి సంచిక తేవాలని కూడా చూస్తున్నాను. ఏమిటో ఊపిరాడకుండా ఉంది. ఆరుద్ర ఇక్కడే ఉన్నాడు. (రాజరాజేశ్వరీ ఫిలిమ్స్, మహమ్మద్ ఉస్మాన్ రోడ్డు. టి. నగర్) నిన్ననే వచ్చానన్నాను కదా. ఇంకా ఎవరినీ కలుసుకోలేదు. ఖాసింఖాన్‌ను అడిగానని చెప్పండి. అక్కడ నా కాగితాల చెత్తలో కొన్ని notebooks ఉండాలని జ్ఞాపకం. వీలయితే వాటిని సముద్ధరించండి.

మిత్రుడు

**Sri Sri**

---

*1. "నీలా ఔర్‌నందా" అనే హిందీ చిత్రాన్ని "ఆహుతి" అనే పేరుతో తెలుగులోకి 'డబ్' చేశారు. దర్శకుడు జగన్నాథ్. నిర్మాతలు వాసిరెడ్డి నారాయణ రావు, మరొకరు. ఈ నిర్మాణం కొంత తెనాలిలో జరిగింది.*

*2. శ్రీశ్రీ పెంపుడు కూతురు, మొదట కొన్నేళ్లు "అనామిక" అని పిలిచినా తర్వాత "లెనినా" అని పేరు పెట్టారు.*

*3. బెజవాడ గాంధీ మునిసిపల్ హైస్కూలు ఆవరణ (16-9-1949)లో చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారికి సన్మానం జరిగింది. తెలుగులో తొలి ఆస్థాన కవి ఆయన. చెళ్ళపిళ్ళ వారి ఆరోగ్యం బాగాలేదు. కవులు ఆయనని వేదిక మీదికి ఎత్తుకుని వచ్చారు. కట్టమంచి రామలింగారెడ్డి, పింగళి - కాటూరి, వేలూరి శివరామశాస్త్రి విశ్వనాథ, జాషువా, దాశరథి మొదలైనవారు ఎందరెందరో హాజరయ్యారు.*

*ఈ స్థాయిలో విశాఖ పట్టణం మునిసిపల్ స్టేడియం (1-2-1970)లో శ్రీశ్రీకి సన్మానం జరిగింది.*

*ఇంతకన్న పెద్ద స్థాయిలో గద్దర్‌ని తెలుగు ప్రజలు హైదరాబాద్ నిజాం కాలేజీ గ్రౌండ్సు (20-2-1990) లో గౌరవించారు.*

*చెళ్ళపిళ్ళవారికి వందల్లో, శ్రీశ్రీకి వేలల్లో, గద్దర్‌కి లక్షల్లో జనం వచ్చారు. ఈ మూడు సమావేశాల్లోనూ చలసాని ప్రసాద్ పాల్గొన్నాడు.*

# 22

Madras

My dear PAS, 24-12-49

మీరు రాసిన ఉత్తరం అందినది. ప్రస్తుతం మట్టుకు, ఇంకా కొన్నాళ్ళదాకా కూడా, నా అడ్రసు ఇదే . (153 V.M.St.) మా ఆవిడ పండుగల దాకా విశాఖపట్టణంలోనే ఉంటుంది. కాబట్టి మీరు తేనె అక్కడకే పంపవచ్చును. లేదా మీ ఇష్టం. ఇక్కడకైనా సరే! నేనొక ఫిలిం సంస్థలో పనిచేస్తున్నానని మీకు తెలుసుననుకుంటాను. (ఒక హిందీ ఫిలిం తెనిగిస్తున్నాం) గురజాడ విషయమై మీరు సేకరించిన సంగతులు ఒక వ్యాసంగా రాసి పంపిస్తారా? ఆరుద్ర ఇక్కడ రాజరాజేశ్వరీ ఫిలిం సంస్థలో ఉన్నాడు. అనిసెట్టి సుబ్బారావు "మరో ప్రపంచం" అని anthology వేస్తానంటున్నాడు. మీరూ, ఖాసిం కలిసి PEN లో చేసిన ప్రకటన చూశాను.[1] నేనీ మధ్య తిరుచినాపల్లి రేడియోలో నేటి తెలుగు సాహిత్యం గురించి (ఆంగ్లంలో) మాట్లాడేను. నా పద్యాల నోటు బుక్కు అన్నారు. ఇంగ్లీషువేనా? ఇంకా అలాంటివి అదే సైజువి రెండు మూడుండాలే! పంపించండి. నా 'మహా ప్రస్థానం' సంపుటాన్ని ఒక మిత్రుడు అచ్చు వేయిస్తానంటున్నాడు.[2] ఆంధ్ర రాష్ట్రం వచ్చాక మళ్ళీ ఉత్తరం రాస్తాను.

Yours

**Sri Sri**

---

*1. "మరో ప్రపంచం" సంకలనం గురించి పురిపండా, ఖాసింఖానూ చేసిన ప్రకటనను దీనికి జతచేస్తున్నాము. ఈజాబు రాసిన తదనంతర కాలానిది ఈ విజ్ఞప్తి.*

*2. నళినీకుమార్ నిజంగానే ఈ సంకలనాన్ని అచ్చువేయించాడు. (జూన్ 1948)*

---

**'మరో ప్రపంచం'**

(అతి నవ్యకావ్య సంపుటి)

మిత్రమా,

తెలుగులో "మరో ప్రపంచం" అన్న పేర అతి నవ్యకావ్య సంపుటి ఒకటి ప్రచురించ సంకల్పించాము. నవ్య సాహిత్యోద్యమాన్ని గురించిన ఒక సమగ్ర విమర్శ దీనికి ఉపోద్ఘాతంగా ఉంటుంది. దీనికోసం మీ సహకారం అర్థిస్తున్నాము.

(1) మీకు నచ్చిన మీ అతి నవ్య రచనలు, అవి ఎన్నయినా సరే. పంపించి, మీ రచనలు పై సంపుటిలో ప్రచురించడానికి అనుమతి ఇవ్వండి.

(2) మీ జీవిత చరిత్ర కూడా సాధ్యమైనంత క్లుప్తంగా ఏ ముఖ్యాంశమూ విడిచిపెట్టకుండా వ్రాసి పంపండి. వీలయితే ఫోటోతో సహా.

మీ కావ్యాలకు ఎక్కడయినా వ్యాఖ్యానం అవసరమనిపిస్తే వ్రాయండి.

మీ సంతకం కోసం అనుమతి పత్రం ఇందులో పంపాము. ఇదంతా మీరు పక్షం దినాల్లో పంపుతూ మా ఉద్యమానికి తోడ్పడతారని ఆశిస్తున్నాము.

శ్రీరంగం శ్రీనివాసరావు,
పురిపండా అప్పలస్వామి
సహాయ సంపాదకులు

చిత్తగింపుడు
మొహమ్మద్ ఖాసింఖాన్,
ప్రధాన సంపాదకుడు
23/7, వేపేరి హైరోడ్డు,
మద్రాసు.

---

ఈ పేరుతోటి తెలుగు కావ్యసంకలనాన్ని అటు ఈ ముగ్గురుగానీ, ఇటు అనిసెట్టి సుబ్బారావు గానీ వెలువరించనేలేదు.

## 23

Madras

My dear Puripada,

12-3-50

నా కేమీ కోపం లేదుగానీ, మీ ఉత్తరం చాలా విచారం మాత్రం కలిగించింది. ఇప్పుడు మీ వొంట్లో యెలా వుంది? (మనస్సులో యెలా వుందని అడగను ) ఈ నెలాఖరు దాకా మీ కార్యక్రమమేమిటి? నేనే ఉత్తరం రాద్దామనుకుంటూ ఉండగా మీ కార్డు అందింది. మీ దుఃఖం లోతు నాకు తెలుసుకాబట్టి. నా సానునయ వాక్యాల నిరుపయోగత కూడా నాకు తెలుసుకాబట్టి మూడు చుక్కల ఈ వాక్యాన్నీ, పేరానీ ముగించేస్తున్నాను....

నేను ఉగాదికి విజయవాడ రేడియో కవి సమ్మేళనంలో పాల్గొంటున్నాను. వెంటనే వచ్చేస్తున్నాను. మీరు రాసే జవాబు పైనిచ్చిన చిరునామాకి రాయండి.

నేను మీకు రాయదలచుకున్న ఉత్తరంలో రాయదలచిన సంగతులేవంటే...

హిందీలో శ్రీ కనూదేశాయ్ ప్రొడక్షన్స్ వారు తయారుచేసిన గీత గోవింద్ అనే చిత్రాన్ని ఒరియా భాషలోకి డబ్ చెయ్యడానికి మా మిత్రులు ఆలోచిస్తున్నారు. ఇందుకు మీ సలహాఏమిటి?

1. తియ్యబోయే చిత్రం ఒరియా ప్రాంతంలో ఆర్థికంగా విజయవంతం కాగలదా?

2. సమర్థులైన play back artists ఎవరు?

3. తర్జుమా పనికి మీరు పూనుకోగలరా? లేక ఇంకెవరి పేరైనా సూచిస్తారా? (శచీరౌత్‌రాయ్ పేరు నాకు స్ఫురణకొస్తోంది. అతని చిరునామా తెలియదు.)

4. ఓఢ్ర ప్రాంతంలో ఎవరైనా పెట్టుబడిదారు లభ్యం కాగలడా?

హిందీ గీత గోవిందంలో లీలాదేశాయ్, ప్రేమ్అదీబ్, సులోచనా ఛటర్జీ, డేవిడ్ మున్నగువారు నటించారు.

అనిసెట్టి దగ్గరనుంచీ మళ్ళీ ఉత్తరం రాలేదు. Anisetti Subba Rao నరసరావుపేట అంటే చాలును. అదే ఎడ్రసు. ఆరుద్ర "త్వమేవాహం" అచ్చయింది. చూశారా?

అనామిక బాగుంది.

నేను త్వరలో మర్సాహిచ్‌పేట ఇల్లు మార్చేస్తాను. అప్పుడు కొత్త ఎడ్రసు మీకు తెలియజేస్తాను. నవీన్ ఫిలిమ్స్‌లో నా రాత పని పూర్తయింది. అయినా తరుచు ఇక్కడే ఉంటున్నాను. Next picture కి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

జవాబు రాయండి.

Sincerely yours

Sri Sri

## 24

Madras

Dear Puripada,

9-6-50

ముద్దా విశ్వనాథం గారి దగ్గర ఈ కార్డు అరువు తీసుకుని రాస్తున్నాను. ప్రస్తుతం నేను ఆనందవాణిలో లేను. ఇంటి అడ్రసు కూడా మారింది. శ్రీశ్రీ నెం. 10 అరుణగిరి ముదలి వీధి, మందవెళి P.O. మద్రాసు. విపులంగా మళ్ళీ రాస్తాను. ఇది రాయడంలో ముఖ్యోద్దేశం ఏమిటంటే: విశాఖపట్టణంలో ఒక నెల్లాళ్లలో మహాప్రస్థానం కాపీలు ఎన్ని అమ్మించగలరో తక్షణంతెలియజేస్తారని. తాజావార్త : మా ఫిల్ము ఈ నెలలోనే విడుదల.

Sri Sri

# 25

Madras
23-6-50

My dear P.A.S.

మీ ఉత్తరం అందింది. ఈ పాటికి 'ఖపట్నం' వచ్చి ఉంటారనీ. 'ఆహుతి' ఫిలిం చూసి ఉంటారనీ భావిస్తున్నాను. ప్రజాభిప్రాయం ఎలా వుంది? (అంటే గల్లా పెట్టె యేమంటోంది?) వానలు కురుస్తున్నా యనుకుంటాను. అందువల్ల Collections దెబ్బ తింటున్నాయా? ఏమను కుంటున్నారు? Masses ఏమనుకుంటున్నారు? ఈ విషయాలన్నీ మీరు రాయాలి.

బహుశా (అనగా నూటికి 90వంతులు) నేను విశాఖపట్టణం రావచ్చును. వచ్చేప్పుడు ప్రస్థానం కాపీలు తెస్తాను. కాని మా పబ్లిషరు ప్రతి వెల 3½ పెట్టాడు. ఎంత మంది కొంటారో తెలియదు.

నేను "నైమిశం" అనే కథల పత్రిక ఒక మిత్రుని ధన సహాయంతో ప్రారంభిస్తున్నాను. ఇది రెండు మూడు నెలలు చక్కగా, పచ్చగా వెలువడితే Poetry Journal కూడా పెడతానన్నాడు మిత్రుడు. "ధ్వని" పేరుతో ఇంకో మిత్రుడు (నా అనుమతి లేకుండా) ఒక పత్రిక వేశాడు. పక్షపత్రిక. 2 సంచికలు వచ్చాయి. సినీమా, సెక్సు, Scandals మొదలైన ఆకర్షణలతో. ఇక నేను మన కవిత్వ పత్రికకి కొత్త పేరు వెతుక్కోవాలి. "సుషుమ్న" అందామని ఉంది. "సుషమ" కూడా బాగుంటుందిగాని షుగర్ జాస్తి. మీ సలహాలు రాయండి.

అనామిక బాగుంది. తేనె పంపించారు కారు. మి ఉత్తరాన్నే తేనెగా భావించి సంతృప్తి పడుతున్నాను.

Sincerely yours
Sri Sri

---

*1. అనేకాలైన శ్రీశ్రీ పథకాల్లాగే ఈ "నైమిశ" పథకం కూడా నెరవేరలేదు.*
*2. మాగాపు రామన్ "ధ్వని" పేరున నడిపింది పచ్చి సినిమాపత్రిక మాత్రమే.*

---

# 26

Madras,
12-7-1950

My dear P.A.S.

మీరు వ్రాసిన ఉత్తరం అందింది. తేనె కూడా. thanks. స్వతంత్రలో గోరాశాస్త్రి మహాప్రస్థానం మీద వ్రాసిన review చూశారా? కవర్ పేజీ ఇంకా తయారుకాలేదు. అనవసరంగా ఆలస్యమయి పోతోంది. మహా అయితే ఇంకో వారం రోజులలో కాపీలు సిద్ధమవుతాయి. ఈ లోపున గుప్తా బ్రదర్స్‌తో మీరే నిశ్చయంగా నా తరపున అన్నీ మాట్లాడి వెయ్యండి. నళినీ కుమార్ 2000 కాపీలు అచ్చువేయిస్తున్నాడు. వెల 3½ రు. ధర అతడు నిర్ణయించినదే. హిగ్గిన్ బాదమ్స్ కోరే కమీషను చాలా ఎక్కువ. గుప్తగారు కూడా మన దగ్గర అంత కమీషను కోరడం ఘోరం. ఏమయినా lumpsum ఇచ్చి తీసుకుంటానన్నారు. కాబట్టి ఎన్ని వందల కాపీలు కావాలోఅడగండి. అన్ని బేరమ్సూ మీరే settle చేసి రాస్తే నేను విశాఖ పట్నం వస్తాను. నైమిశం పెడతానన్న పెద్ద మనిషి వెనుకంజ వేశాడు. మళ్లీ యధాపూర్వ స్థితికి వచ్చాను. వెంటనే జవాబు వ్రాయండి.

హిగ్గిన్‌బాదమ్స్ పుస్తకాల మీద 25% తీసుకుంటారు. మనం గుప్త గారికి 20%గాని, 15%గాని ఇవ్వవచ్చు ననుకుంటాను. ఆలోచించండి. తుది నిర్ణయం మీదే.

Sri Sri

# 27

Madras,
My dear P.A.S. 28-8-50

మీ ఉత్తరం (d. 25th) అందింది. అంతకు ముందుది అందలేదు. Rao & Rao[1] మన స్నేహితులు. అమ్మడం కొనడం అనే ప్రశ్న లేదు. హక్కులన్నీ రచయితవని పుస్తకంలో మీరు చూడవచ్చును.

గుప్తా బ్రదర్సు[2] వారి షరతులన్నీ నాకు సమ్మతమే. అయితే ¼ కి బదులు ½ గానీ పంపిస్తే ప్రస్తుతంలో నాకు చాలా సహాయం చేసిన వారవుతారు. ఇందుకు వారిని ఒప్పించండని కోరుతున్నాను. ఏది యెలా వున్నప్పటికీ వెంటనే కొన్ని కాపీలు Ry. Parcel లో పంపించే ఏర్పాట్లు చేస్తున్నాను.

ఇక్కడ ఈ మధ్య స్థానాపతి[3]ని చూశాను.

నా రేడియో నాటికల సంపుటిగాని, కథల సంపుటిగాని, Same గెటప్‌తో Gupta గారు ప్రచురిస్తారేమో కనుక్కోండి.

అనామికతో సహా అందరం క్షేమం. ప్రస్తుతం నేను HM రెడ్డిగారి రోహిణీ[4] పిక్చర్సులో పని చేస్తున్నాను.

Sri Sri

---

*1 "మహాప్రస్థానం" గ్రంధవిక్రేతలు, మచిలీపట్నం.*

*2. విశాఖపట్నంలోని పుస్తక విక్రేతలు, ప్రచురణ కర్తలు, శ్రీశ్రీ కథారచనలను "చరమరాత్రి" పేరిట అచ్చు వేశారు.*

*3. స్థానాపతి సత్యనారాయణశాస్త్రిగారు,*

*4. రోహిణీవారి "నిర్దోషి" చిత్రానికి శ్రీశ్రీ పాటలు రాశాడు. "ప్రతిజ్ఞ"కి కూడా.*

---

# 28

Madras,
Dear Appalaswamy Garu, 20-9-50

మీ ఉత్తరాలు అందినవి. వైరు తప్పుగా address చెయ్యబడింది. కాబట్టి (13 అరుణాచల ముదలి వీధి అని) అందచెయ్యలేదని ఆ తప్పు అడ్రెసుకే మనశ్రీ, తపాలా, తంతి శాఖవారు వ్రాసిన ఉత్తరం అందింది. పుస్తకాలకై ఆ కొసనించి మీరెంత తొందరపడుతున్నారో ఈ కొసనించి అంత ఆలస్యం అవుతోంది. ఇందుకు నేను చాలా చింతిస్తున్నాను. మా పబ్లిషరుకీ నాకూ కాపీల విషయంలో కొంత అభిప్రాయ భేదం వచ్చింది. నేను 500 కాపీలు అడిగితే అతను 50 ఇస్తానంటున్నాడు. ఇది యింతట్లో తెగదని తోస్తుంది. అయినా ఈ రోజు మళ్ళీ గట్టిగా ఉత్తరం రాస్తున్నాను. పవిత్రమైన పెట్టుబడిదారీ విధానంలో బతుకుతున్న మనం చిన్న ఇబ్బందులకు లక్ష్యపెట్టనక్కరలేదు. 500 కాపీలు ఇవ్వకపోతే అసలే కాపీ లక్కరలేదని ఉత్తరం రాస్తున్నాను. ఇరవై యేళ్ళ తర్వాత ఈనాటికి పుస్తకం అచ్చు అయిందన్న సంతోషంతోనే సంతుష్టి పొందుతాను.

హైదరాబాదులో ఏ పత్రిక? Press Cutting పంపించండి.

Sri Sri

## 29

Madras,
30-1-1951

My dear Mr. Ramana Reddi,

Thanks for your letter and the information contained there in. I have long ceased to bother myself about what critics say or do with my poems or any of my other writings. The poem in question was originally published in the కాగడా annual a few years ago under the title. I shall send you the full text and a copy of the transaltion that appeared in the **Chakra,** some time later. The following is the original, the translated version of which so perturbed the gentleman of the Illustrated weekly initialled C.R.M.

కాసరమా వికారములు కార్చకు పూసరమా మసారపున్
రాసులలో కపాలములు రాల్చకు తావళమా విషాదపున్
వేసములో కుశాసనము పేర్చకు రాసభమా సమాధిలో
మీసము పెంచి మా తొడలమీద నటించకు పుణ్యమయ్యెడున్.

I feel really flattered that the worthy critic should choose out of all the articles and poems that appeared in the **Chakra** a passage from my poem even though with the evil intention of holding it up to ridicule. And it is not I who should be held responsible if he recognised his spiritual brother in the particular animal in question. I am deeply touched at his concern for the whiskered specimens in the Telugu language but I would very much like that some one whould tell him that he need feel unduly perturbed and all is well with Telugu. So that is that.

Narapareddi has also written to me about the introduction that I should have sent such a long time ago. I shall do so in a day or two. Kindly hand over the Aragon volume to Mr. Narapa Reddi.

Sincerely yours

Sri. Sri

** This letter of SRI SRI's was in reply a letter written by KVR earlier, informing him of an unfavourable comment on the English version of his Telugu poem in the columns of the ILLUSTRATED WEEKLY OF INDIA. The then editor of that periodical, C R Mandy wrote derisively of "whiskered donkeys" in the course of his weekly feuilleton GALLIMAUFRY.*

## 30

విజయవాడ
24-2-52

Dear PAS

గ్రాడ్యుయేట్సు నియోజకవర్గం నించి కౌన్సిలుకి నిలబడుతున్నాను. మార్చి 17 లోపున పోస్టు ద్వారా వోటింగు. కమ్యూనిస్టుపార్టీ నా అభ్యర్థిత్వాన్ని బలపరుస్తోంది. మీరు 17వ తేదీ లోపున మళ్ళీ విశాఖ వెళ్ళే అవకాశాలు లేవా? నేను మార్చి మొదటి వారంలో విశాఖ జిల్లా పర్యటించ దలచుకున్నాను. మీరు కూడా అప్పుడక్కడ ఉంటే బాగుంటుంది.

శ్రీశ్రీ

*1. మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలుకు శ్రీశ్రీ కమ్యూనిస్టుపార్టీతోడ్పాటుతో ఎన్నికయ్యాడు (1953)*

# 31

Madras,
9-9-53.

To,

Moonas[1]

I am working on the script. I am sending here with a synopsis. If you have any constructive suggestions they are welcome. I had a talk with music director Rajeswararao and impressed upon him the desirability of working with a producer of your calibre. I am confident that I can persuade him to accept your figure (7500Rs.) But I think that If you go in for 3 versions (Tamil, Telugu and Sinhalese) 10000 may not be unreasonable. I can assure you that he richly deserves it. He has no objection to have Purnanandam as his associate.

* * *

* Are there any poets in India? A sad question to ask It is like asking whether there are any human beings in this land. Frankly speaking, there are only subhuman species inhabiting this land. Here and there among them one occasionally finds that curious type the poet.

* *This has been struck off by the wirter himself in the SCRAP BOOK.*

---

*1. మూనాస్ . సిలన్ దేశస్థుడు. కోటీశ్వరుడు. సాహిత్యం పట్ల ఆసక్తి ఎక్కువ. కథ, మాటలు, కొన్ని పాటలూ తానే రాసి 'ప్రపంచం' అనే సినిమా 6 భాషల్లో (1953) నిర్మించాడు. లక్షలు వెచ్చించాడు. సినిమా విజయవంతం కాలేదు.*

---

# 32

Madras,

*అబ్బూరి వరద రాజేశ్వరరావుకి* 　　 *5-8-54.*

My dear Rajeswar Rao,

I am sending herewith "నగరంలో వృషభం" and a translation of Dylon Thomas's *'The hand that signed the paper'*. I suggest you maintain a foreign relations section in the poetry magazine. In a day or two I'll be sending you a long poem (translated from the French of Guillanme Appollinaire) - or atleast a part of it. I shall write to Kaluri and find if he has any unpublished poems. Krishna Sastry has recently done a radio play Andal Kalyanam. I was told the songs were fine. I shall meet him and gather a few.

Arudra will sent his poems if he has not already done so.

Sincerely yrs
Sri Sri

# 33

Madras,
12-10-54

Under Secretary,
Home (Passports) Dept.,
Government of Andhra,
KURNOOL. *

Sir,

At present I am not visiting any other country of Europe except the U.S.S.R. In my letter dated the 9th Inst. I requested that the other European countries may also be included in my passport because I might have to travel via Europe if the Kabul route is not available. I may visit England and France at a later date and my stay there may not exceed a month. I request to include the following countries.

Sri Sri

---

* *This letter was obviously written prior to his departure to USSR in December 1954. His request to include other western European countries in his passport was granted by the Govt of Andhra and he visited some of them after leaving USSR*

---

# 34

Madras,
14-10-54

Dear **పురిపండా అప్పలస్వామిగారూ,**

మీరు పంపిన ఆహ్వానం అందింది. మిత్రుడు వీరరాజకవికి విశాఖ పౌరులు సన్మానం జరపడం ముదావహం. సన్మాన సందర్భంలో వ్యావహారిక భాషోద్యమ కృషికి విజయం చేకూర్చే ఏర్పాట్లు కూడా జరిగితే మరీ సంతోషిస్తాను. త॥ గుప్తాగారు నాకు 100రు. అడ్వాన్సు ఇచ్చారనికదూ రాశారు. దయచేసి ఏ తేదీని ఇచ్చారో కనుక్కుంటారా? పంపిన కథలు అందినట్లు కూడా ఉత్తరం రాయలేదే, అందుకు కారణమేమిటో కనుక్కుంటారా. దరిమిలాని రామంకి రాసిన ఉత్తరాలకి ఒక్కదానికీ జవాబు రాయలేదే? నన్ను అవమానించదలచుకుంటే ఇంతకన్నా చెయ్యదగ్గ దేముంటుంది? అందుచేత ముందుగా నాకు ఉత్తరం రాశే దాకా నా కథల సంపుటి ముద్రణకు అనుమతించదలచలేదని తెలియజెయ్యండి. ఈ వ్యవహారంలో వారవలంబించిన పద్ధతి, పెద్ద మనిషి తరహాకు చాలా దూరంగా ఉందని నేనభిప్రాయపడుతున్నాను. మీ ఉద్దేశమేమిటో వ్రాయండి.

Yours
శ్రీశ్రీ

---

*1. 'చరమరాత్రి'*

# 35

Madras,

Dear PAS,
7-11-54

మీ ఉత్తరం అందింది. 10వ తేదీని బయల్దేరి బొంబాయి వెళ్లుతున్నాను. అక్కడనించి ప్రపంచశాంతి మహాసభకి స్టాక్‌హోం. పర్యటన వివరాలింకా తెలియవు. బహుశా నెలాఖరుకిగాని, డిసెంబరు మొదటివారానికిగాని తిరిగివస్తాను. అప్పటికి మీరుగానీ మళ్లీ విశాఖకి వస్తారా? నేను కనీసం వారం పదిరోజులు విశాఖజిల్లా అంతటా శాంతి ఉద్యమం సందర్భంలో సంచారం జరుపదలచుకున్నాను. అన్ని రకాల మనస్తత్వాలవారినీ ఇందులోకి తీసుకురావాలని సంకల్పం. మీరు గేయాలు నాటికలూ కొన్ని ఈ ఉద్యమం కోసం రాయాలి. "కవిత" చూశారా? వరదరాజేశ్వర్రావు హైదరాబాదునించి వెలువరించాడు. తొలిసంచిక ఆశాసూచకంగా ఉంది. మీ రచన లేవేనా పంపించండి.

వెంటనే జవాబురాస్తే నా బొంబాయి ప్రయాణంలోపుగా అందుతుంది. చిరునామా పాతదే.

శ్రీశ్రీ

---

*1. కవిత :- అబ్బూరి ఛాయాదేవిగారి సంపాదకత్వంలో ప్రారంభమైన కవిత్వ పత్రిక. ఏడాదికి మూడు సంపుటాలు వెలువరిస్తామని ప్రకటించారు. కాని రెండు సంచికలు ప్రచురించినాక ఆగిపోయింది. తొలిసంచిక ఆగస్టు, సెప్టెంబరు 1954 లోనూ, మలిసంచిక డిశెంబరు 1954లోను వెలువడ్డాయి. ఈ రెండు సంచికల్లోనూ అబ్బూరి రామకృష్ణారావు, వరద రాజేశ్వరరావు, శ్రీశ్రీ, ఆరుద్ర, అజంతా, తిలక్, కుందుర్తి, ఏల్చూరివగయిరాల కవితలున్నాయి.*

---

# 36

Bombay

***తుమ్మల వెంకటరామయ్యకి***
***13-11-54***

Dear friend,

ప్రాసక్రీడలు అందాయనుకుంటాను. ఇవాళ మద్రాసునుండి వచ్చాను. 5-30కి delegation తో బయలుదేరుతున్నాను. మళ్ళీ ఉత్తరం రాస్తాను. మన friends కి చెప్పగోరతాను.

Yours Sincerely

Sri. Sri

---

*1 స్టాక్‌హోం నగరంలో జరిగిన ప్రపంచశాంతి మహాసభకు ప్రతినిధిగా వెళుతూ రాసిన లేఖ. 1954 నవంబరు మాసాంతంలో ఆ సభ జరిగింది. శ్రీశ్రీ మాస్కో, పేరిస్, లండన్ నగరాలు చుట్టి వచ్చాడు.*

---

# 37

Hotel Malmen,
Stockholm, Sweden,

Dear Dwaram Jagannadha Rao
26-11-54

Here I am in Stockholm for the last ten days busy with conferences and commissions of the World Peace Council. The sessions ended day before

yesterday and I am going to Moscow on an invitation by the Soviet Peace Council. On my way here from India I stopped for two nights in London and before that for a few hours at the Rome aerodrome. On my way back I may stop for a day at Paris.

Stockholm is a very beautiful city, very clean, the people so cheerful and charming and the standard of life is very high. I am told that an ordinary unskilled worker here earns 9000 kronos (more than eight hundred rupees) and there is practically no unemployment here. London looks a dreary place compared to Stockholm.

This is winter and the weather is foul. You feel it only when you go out. Inside your Hotel there is electoral heating and all amenities and comforts are provided for. You know the 'press button' civilization of Europe.

I shall write to you again from Moscow as soon as I reach there in a day or two. Meanwhile you can write to me to the following address.

(air mail please)

S. Srinivasa Rao
Indian Peace Delegate,
C/o. Soviet Peace Council, Moscow.

Greetings & Cheers
శ్రీశ్రీ

19-12-54

నా మద్రాసు అడ్రెసుకు జవాబు వ్రాయగోరుతాను.
On my way from Paris to Geneva.

With best regards.
Sri. Sri

---

** Sri Dwaram Jagannadha Rao of Visakhapatnam is, of all SRI SRI' boyhood associates, the most intimate and close to the poet. Their friendship has survived four whole decades and the warmth of feeling of the one for the other is indeed remarkable.*

*SRI SRI wrote the first of these two letters to Sri Jagannadha Rao during his visit to the USSR in 1954. The second was written on the eve of his second visit to the same country, twelve years later.*

# 38

Madras
8-3-55

**తుమ్మల వెంకటరామయ్యకి**

Dear Comrade,

నెల్లాళ్ళకి పైగా క్లినిక్‌లో గడిపిన తర్వాత నిన్ననే ఇంటికి వచ్చాను. అయితే, మరో నెలరోజులబాటు ఎక్కడికీ కదలకుండా ఇంటిపట్టునే ఉండి, పూర్తి విశ్రాంతి తీసుకోవలసిందనీ, ప్రతిదినం వచ్చి ఇంజక్షను తీసుకుంటూ వుండవలసిందనీ డాక్టరు గారి ఆర్డరు. ఆ తర్వాత కూడా కొన్నాళ్ళబాటు ఏదైనా చల్లని ప్రదేశంలో గడపాలని అనుకుంటున్నాను.

ఈ నెల్లాళ్ళలోగా ఇప్పుడున్న మకాం మారుస్తా ననుకోను గాని ఒకవేళ మాంబళంలో మంచి ఇల్లు దొరికితే-మారితే, తెలియబరుస్తాను.

ఎన్నికల ఫలితాలు కాంగ్రెసుకి అఖండ విజయంగా అంగీకరించవచ్చు గాని కమ్యూనిజానికి ఘోరపరాజయ మనడానికి వీలులేదు. కాంగ్రెసుమార్కు-సామ్యవాదానికి మోసపోయి మన ప్రజలింత సులువుగా విశాలాంధ్ర ఉద్యమానికి విడాకులిచ్చేశారంటే నమ్మడం కాస్త కష్టమే చరిత్ర అందించిన మహదవకాశాన్ని చేజేతులా జారవిడుచుకున్నారు మన ప్రజ. అయినా ఫర్వాలేదు. శీఘ్రంగా కాకపోతే ఆలస్యంగానైనా విశాలాంధ్రరాష్ట్రాన్ని మనం సాధించి తీరుతాం.

మన మిత్రులందర్నీ అడిగానని చెప్పండి.

Sincerely yours
Sri. Sri

---

*శాంతిమహాసభ సందర్భంలో రష్యాకు వెళ్ళి తిరిగివచ్చాక, 'ఆంధ్ర పత్రిక' లేవగొట్టిన కమ్యూనిస్టు వ్యతిరేక ఉన్మాదంలో శ్రీశ్రీ మీద గాలిదుమారం రేగింది. 1955 ఎన్నికల ప్రచార సంరంభంలో పడి తిరుగుతూండగా, హనుమాన్ జంక్షన్‌లో ఆయనకు మతి చలించిన సూచన మొదటిసారి కన్పించింది. తర్వాత ఆయనను మద్రాసులో ఒక మెంటల్ క్లినిక్‌లో చేర్చి చికిత్స చేయించారు.*

---

# 39

Madras
?-3-55

Dear **వెంకట రామయ్య గారు,**

మీ ఉత్తరం అందింది. అభ్యుదయ రచయితల సంఘం పునరుద్ధరించవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. అయితే నేను మరికొన్నాళ్ళదాకా ప్రయాణాలేవీ చెయ్యగల స్థితిలో లేను కాబట్టి ప్రాథమిక సభకి హాజరు కాజాలనందుకు సభవారికి నా క్షమాపణలు తెలియజెయ్యండి. ఇది విశాలాంధ్ర ప్రాతిపదిక మీద జరగాలని నా ఉద్దేశం. అసలు పేరు విశాలాంధ్ర అభ్యుదయ రచయితల సంఘం అని ఉంటే బాగుంటుందేమో! ఇటీవలి గాలి దుమారంలో తెల్లగొర్రెలేవో నల్ల గొర్రెలేవో తెలిసిపోయింది కద! మన ప్రతి పక్షులెలాగూ (ప్రభుత్వ సహాయంతో) పెద్ద ఎత్తున సభ జరుపుతారు. (వాటి ఫలితం ముందే జాతకం రాయవచ్చును.) అయితే అతి మధురంగానూ, అత్యున్నతంగానూ తీర్మానాలు జరుపుతారు. రచయితల ఆర్థిక పరిస్థితిని బాగు చెయ్యడానికి పూచిక పుల్లంత పని కూడా జరగదని నికరంగా చెప్పవచ్చును.

ఇక్కడ అనిసెట్టి, ఆరుద్రా ఒక పత్రిక వెలువరించబోతున్నారు. వాళ్ళని మళ్ళీ నేను కలుసుకోలేదు. సాయంత్రం ఆరుద్రకి మీ ఉత్తరం అందజేస్తాను.

మళ్ళీ విపులంగా నా అభిప్రాయాలు తెలియజేస్తాను.

Sincerely yours
Sri. Sri

PS : బహుశా త్వరలో నేను మాంబళం మారవచ్చును. మారిన వెంటనే కొత్త అడ్రెసు తెలియజేస్తాను.

శ్రీశ్రీ

## 40

Madras,

My dear Varada, 28-3-55

Herewith a translation of your పద ముందుకు - వెనుక ఆపద. You'll readily see that I have taken a few liberties with the text in anticipation of your approval. I am translating my మరో ప్రపంచం also and hope to send you the same very soon. Could you publish my translations of Gurazada's దేశభక్తి and my in the first issue of poetry Telugu? That they were already published elsewhere need not prevent you, I think, from printing them again.

As to my health I still feel general physical weakness. I have to continue with daily injection till the end of this month. Later I shall visit Chalam at Ramanasram.

Is there any possibility of your going to Madras in the near future.

Sincerely Yrs

Sri.Sri

## 41

Madras

My dear Varada, 1-4-55

మీ 30, 31 తేదీల ఉత్తరాలు అందాయి. పఠాభి అడ్రెసు Marina Canteen, Triplicane. చలం అడ్రెసు రమణాశ్రమం Tiruvanamalai నేను బహుశా ఈ నెల 14వ తేదీని రమణాశ్రమం వెళ్ళవచ్చు. మూడు నాలుగు రోజులక్కడ వుండి తిరిగి వచ్చేస్తాను. ఈలోగా నావైతేనేం, మిత్రులవైతేనేం తమాషాదేఖో లంకకే రాజా సుమారు 20 తర్జుమాలు పంపిస్తాను. సాయిబూ! ఏనుగులకి కావలసినంత రొడ్డు!

complacent nonviolent concupiscent అన్న తర్వాత totally teetotaler అని కూడా కలిపితే బాగుండదూ మొత్తానికి తర్జుమా ధుమాగా వుంది.

Yours ever

Sri.Sri

## 42

Madras,

My dear Varada, 6-4-55

I shall send per seperate registered post a bound note book which contains all my translations - of own and others' poems. Get them typewritten there and send me back the note-book. Have you seen the PEN bulletin. There is a short notice of your cherakalam and a mendacious, tendencious report of the recent

newspaper controversy. The blighter says that I had initiated the same and that Padmaraju had led the counter attack! Some news indeed.

Shall write again at length.

Yrs
Sri Sri

## 43

Madras,
8-7-55

Dear Venkatramaiah Garu,

మీ ఉత్తరం అందింది. వెంటనే జవాబు వ్రాయలేకపోయినందుకు క్షమించండి. మహాసభకు సంబంధించిన ప్రయత్నాలన్నీ చేస్తున్నాము. అధ్యక్షతకు ఇందు మూలంగా నా అంగీకారం తెలియజేస్తున్నాను. 15వ తేదీలోగా అధ్యక్షోపన్యాసమూ, లెనిన్ కావ్యం నుంచి కొన్ని భాగాలూ పంపిస్తాను.

Sincerely Yours
Sri Sri

"విశాలాంధ్ర"కి Paul Eluard గీతం ఒకటి translate చేసి పంపించాను. అందే వుంటుంది. పత్రిక నాకు regular గా వొస్తోంది.

"వాయువ్య" అని వాడుతున్నారు. అది తప్పు. "వాయువ్యము" రైటు.

"మరొక" అని కొన్నిచోట్ల, "మరో" అని మరి కొన్నిచోట్లా వాడుతున్నారు. ఏదో ఒక రూపం ఖాయం చేస్తే బాగుంటుంది.

Sri Sri

1. ఆంధ్ర అభ్యుదయ రచయితల 5వ మహాసభ విజయవాడలో 1955 జులై 30, 31 తేదీల్లో జరిగింది.

## 44

Madras,
20-9-55

Dear Appalaswamy Garu,

మీరు విశాఖపట్టణంలో ఉన్నట్టు తెలిసింది. సరియైన చిరునామా వ్రాయ గోరుతాను. ఈ మధ్య విజయవాడలో మన అభ్యుదయ రచయితల సంఘం 5వ సమావేశం జరిగింది. ముఖ్యతీర్మానాలలో ఒకటి "అభ్యుదయ" పత్రికను వెలువరించడం; ఇంకొకటి, వాడుక భాషను మన ప్రభుత్వమూ, విశ్వవిద్యాలయాలూ గుర్తించేటట్లు చెయ్యడం. పత్రికను మద్రాసు నుంచి నడుపడానికి ఏర్పాట్లు చురుగ్గా జరుగుతున్నాయి. మీ పద్యాలు (కనీసం ½ డజనైనా) పంపాలి. రాచకొండ విశ్వనాథశాస్త్రి చిరునామా కావాలి. మీరే అతని దగ్గర ఒక షార్ట్‌స్టోరీ తీసుకుని పంపిస్తే మరీ మంచిది. ఇంకా తతిమ్మా మన మిత్రుల దగ్గర నుంచి కథలూ వ్యాసాలూ పద్యాలూ పంపగోరుతాను. నాకైనా సరే, లేదా అనిసెట్టి సుబ్బారావు (8 హబిబుల్లా రోడ్డు, త్యాగరాజనగరు) కైనా సరే. ఇంకో సంగతి. గుప్తా బ్రదర్సుకి ప్రచురణార్థం నా కథల సంపుటం పంపించాను. తర్వాత ఎన్ని ఉత్తరాలు రాసినా జవాబులేదు. వెంటనే అచ్చువేస్తే సరి. లేదా ఈ ఉత్తరం చూపి నా కథలు వారి వద్దనుండి వాపసు తీసుకొండి. అచ్చువేస్తే ఏ షరతుల మీద వెయ్యబోతున్నారో

కనుక్కోండి రచయితలకూ, ప్రచురణ కర్తలకూ మధ్య సత్సంబంధాలు నెలకొల్పవలసింది పోయి మనస్పర్ధలకు దారితీసే పద్ధతులవలంబించడం మంచిది కాదని నామాటగా తెలియజెయ్యండి నా అడ్రెసు పాతదే - అరుణగిరి ముదలి వీధి.

Sincerely Yours

Sri Sri

*పద్యాలేకాదు, కథ, విమర్శ, వ్యాసం, నాటిక ఏవైనా సరే.*

## 45

Madras,

My dear Varada, 20-9-55

You have been silent for quite an exasperatingly long time. What Ho, what's looking out there? Did you receive my last letter requesting you to send me back my Ms translations. I need them here badly. Do please mail them at your earliest best time. And the poetry Reviews both Tel. and Eng. What has happened. Do please reply at once, or at twice or even thrice.

Yours a more than a dozen times ever.

Sri Sri

Once again

Do send *Ms* immediately if not earlier.

Yrs

Sri Sri

## 46

Madras,

తుమ్మల వెంకటరామయ్యకి 18-2-1956

Dear friend,

To-day I received from the Assistant Executive Secretary of the Soviet Peace Committee, a copy of my Radio talk broadcast over the Moscow Radio. I shall translate it into Telugu and send it to you for favour of publication in the Sunday edition of "Visalandhra".

The following is the next of the covering letter. Kindly show the same to the Secretary, Andhra Peace Committee so that he can act upon it.

Dear Mr. SRI SRI

We owe you an apology for delaying this reply to your letter. It was because we were trying to find the texts of your radio addresses, in which you are interested.

Of the two addresses we are sending you one. The other is at the Radio Committee in the form of a tape recording, and will therefore have to be

transcribed from the tape. As soon as the radio committee does that and gives us the text we shall forward it to you at once

It is with great pleasure that we recall your sojourn in the U.S.S.R. We wish you good health and fresh successes in your creative endeavours.

If you would inform us what arrangements are being made for the Kalidasa Commemoration in India, and by the Writers of Andhra Province in particular, we would appreciate it immensely.

The Soviet Peace Committee is preparing jointly with the Union of Soviet Writers for the celebration of that cultural anniversary.

Z.N. Petrunicheva of the institute of Oriental studies has asked us to inform you that several of your poems will appear in the collection of works by the poets of Asia, to be published in the coming year. She intends to send you a copy of that anthology.

With friendly regards,

M. Makarchenkov (Sd.)

Asst. Executive Secretary of the soviet peace committee.

With friendly regards

Sri. Sri

## 47

Madras, 23-4-56

Dear PAS

సంతోషపూర్వకంగా సమ్మతి

Sri. Sri

కాజాతలం : ఒకసారి Gupta Bros. వైపు వెళ్లేటప్పుడు నా కథల సంపుటి ఏ స్థితిలో ఉందో కనుక్కుంటారా?

శ్రీశ్రీ

*'చరమరాత్రి' తొలి ప్రచురణ (గుప్తాబ్రదర్సు)కి పర్మిషన్.*

## 48

Madras,

3-4-56

**తుమ్మల వెంకటరామయ్యకి**

Dear friend,

అనిసెట్టిని కలుసుకున్న తర్వాత ఈ ఉత్తరం రాద్దామనుకున్నాను. కాని ఇంతవరకు అతణ్ని కలుసుకోవడమే పడలేదు. "అభ్యుదయ"కి నా మాస్కో రేడియో ప్రసంగం ఆరుద్ర తెనిగిస్తున్నాడు. త్వరలోనే పంపగలను. వ్యావహారిక భాష మీద స్టేటుమెంటు విషయం కూడా నేనూ అనిసెట్టీ తొందరలో ఒకదారికి తెస్తాం. ఇక్కడ అందరి పరిస్థితీ చాలా అవ్యవస్థగా ఉంది. మళ్ళీ ఉత్తరం రాస్తాను.

Sincerely Yours

Sri Sri

## 49

Madras,

My dear Varada, 6-7-56

Have received all your letters. I am slightly indisposed these last few days Shall write[1] you again. I've composed, in part స్వవిషయ సూచిక Have you seen East & West? How about Kavita in English. Do keep writing to me.

Sincerely Yours

Sri Sri

---

*East West* అనే ఇంగ్లీషు త్రైమాసిక హైద్రాబాదునుంచి శ్రీనివాస రాయప్రోలు (1960కి ముందు) నడిపాడు. ఆ పత్రికలో శ్రీశ్రీ కవితల ఇంగ్లీషు అనువాదాలు కొన్ని అచ్చయ్యాయి. వాటిమీద కొన్ని విమర్శలొచ్చాయి.

---

## 50

Madras,

Dear Venkata Ramayya garu, 3-9-56

Can you please send me the translation into English of Rentala's "Hiroshima" which you remember I made when the Japanese friend visited us? I am collecting material for the anthology. You'll find a copy of Rentala's poem in the Peace Committee Office or with Sri G. Radha Krishna Murthy. As for Tataji's sanmanam we have already chalked out a programme and our local Writers' Committee is meeting on Wednesday, Please give me Ramana Reddi's correct address.

Sincerely Yours,

Sri. Sri.

---

** 'Tataji' is Sri Tapi Dharma Rao, the G.O.M. of Telugu letters, happy in our midst. Born at Berhampore in the Ganjam district in 1887, 1967 he brought out the magnum opus of his long literary career, the richly-annotated edition of VIJAYA VILASAMU. 'Tataji' is the name by which he is known to his younger admirers. His sanmanam was celebrated in Madras on 19 September 1956.*

---

## 51

Madras,

తుమ్మల వెంకటరామయ్యకి **18-2-57**

Dear friend,

I am going to Cocanada tomorrow night to address the students of the Andhra Polytechnic there. I am starting by Calcutta Mail tomorrow. Can you make it convenient for you to meet me at Bezwada station on 20th morning?

Sincerely Yours,

Sri. Sri.

## 52

Madras,

Dear Venkata Ramayya garu,
23-2-57

నిన్ననే కాకినాడనుండి వచ్చాను. వెళ్ళే ప్రయాణంలో నిద్రపోతూ నూజువీడు వద్ద మేల్కొన్నాను ఇందులో ఒక Radio talk పంపిస్తున్నాను. ఇది ఇవ్వాలనే అనుకున్నాను. ప్రయాణం తొందరలో నాతో తీసుకురాలేదు.

హైదరాబాదు సభల గురించి చదివాను. అక్కడ అభ్యుదయ రచయితల సంఘం organize చేసే ప్రయత్నాలు ఏ స్థితిలో ఉన్నట్టు? మార్చి మొదటివారంలో (ఇదివరకు మనం అనుకున్నట్లు) చెయ్యగలిగితే ఎన్నికలకి కూడా ఊతం ఇచ్చినట్టుందికదా! వివరంగా జవాబు వ్రాయగోరుతాను.

ఇక్కడ మేం వసూలు చెయ్యవలసిన లిస్టు మీరు తీసుకుపోయారని అనిసెట్టి చెప్పాడు. అతనికిగాని నాకుగాని ఒక కాపీ పంపించండి.

పత్రిక అచ్చుపనులు ప్రారంభించారా? మీకు అర్జెంటుగా కావలిస్తే పద్యాలు కూడా పంపిస్తాను. (Spanish poems) ఒకటి రెడీగా ఉంది. రెండోదికూడా తయారుచేస్తాను.

Sincerely Yours,

Sri. Sri.

## 53

Madras,

హరి పురుషోత్తమరావుకి
16-3-57

డియర్ ఫ్రెండ్,

నామీదా, నేను రాసే రాతలమీదా, ఇప్పుడేమిటి ఇరవయ్యేళ్ళనించి దుష్, సత్ ప్రచారాలు జరుగుతూనే ఉన్నాయి. నేనూ జరుగుతూనే ఉన్నాను. ఊపిరి తీస్తున్నంత కాలం ఉంటాను.

నా ప్రోజ్ రైటింగ్స్ (క్రిటికల్ ఎస్సేస్) కలెక్ట్ చేస్తానని గుడివాడలోనూ, ఖడ్గసృష్టి, పోస్ట్ మహాప్రస్థానం పోయమ్స్ కలెక్ట్ చేస్తానని విశాఖపట్టణంలోనూ అన్నాను. చేస్తాను.

మీ ఉత్తరంలో రాసిన భావాల వంటివే నేటి ఆంధ్ర విద్యార్థిలోకంలో ఒక స్థిరమైన అభిప్రాయంగా కరడు కట్టుకు పోతున్నాయని లోగడ ఒకసారి గోరాశాస్త్రి నన్ను హెచ్చరించాడు. "నువ్వేమీ వ్రాయకపోవడం వారి విశ్వాసాలను ఋజువు చేస్తోంది" అని కూడా అన్నాడు.

అప్పుడు నేను "స్వతంత్ర"కి ప్రతివారం ఏదో ఒకటి రాదా మనుకున్నాను. కాని ఈ విధంగా నా నిజాయితీనిగాని చేతనైన తనాన్నిగాని ఋజువు చేసుకోవలసిన అవసరం నాకు కనబడలేదు. అందుచేత, అప్పటి వేడిలో వ్రాసిన ఒకటి రెండు వ్యాసాలు ("వారం వారం" శీర్షిక మళ్ళీ revive చేదామనుకొని వ్రాసినవి) బయటపెట్టలేదు.

ఈ ఉత్తరం రాశాక నేనా వ్రాత ప్రతులకోసం చాలా వెదికాను. కాని దొరకలేదు.

అందులో ఒక చోట నేను వ్రాసిన దాని సారాంశం ఇక్కడ ఉల్లేఖిస్తున్నాను.

"కిందటి ఎన్నికలలో దైవం (అనగా ఛాన్స్) మన ఆంధ్రులకి మొట్టమొదటి సారిగా ఇండియాలో కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని ఏర్పాటు చెయ్యగల అవకాశాన్నిచ్చింది. దాన్ని మనం జారవిడుచుకున్నాం. ఇకమీద కేరళలోనో వంగరాష్ట్రంలోనో సామ్యవాద ప్రభుత్వాలు ఏర్పడ్డ తర్వాత మనవాళ్ళ కళ్ళు తెరుచుకుంటాయి."

మీ ఉత్తరం చివరి పేరాలో అడిగిన ప్రశ్నకు ఇది సమాధాన మిస్తుంది. మన పరాజయాని కారణాలేమిటి? ఇపుడు వెదకటంలో మునిగి ఉన్నాము ఐతే నేను దీన్ని పరాజయంగా భావించట లేదు. లేక దీన్ని పరాజయంగానే మనం అంగీకరించవలసివుంటే, 1905లోని రష్యన్ విప్లవ అపజయం పొందిందనే భావంలాంటి అపజయమే ఇదీను.

(ఆరుద్రకి వెంటనే రాయాలంటే C/o. మోడరన్ థియేటర్స్. సేలమ్ అని రాయండి అది తక్షణం వాళ్ళు రీడైరెక్ట్ చేస్తారు.)

యులిసెస్‌నీ, పెన్నిగన్స్ వేక్‌నీ చదవదలచుకున్నందుకు సంతోషం. కాని మున్ముందుగా, జాయ్స్ మొట్టమొదటి నవల Portrait of the Artist as a young man చదవండి. తర్వాత అతని జీవిత చరిత్ర స్టూ ఆర్ట్ గిల్బర్ట్ రాసిందిగాని ఇటీవల మరేవైనా వస్తే అవిగానీ చదవండి.

హోమర్స్ ఒడిస్సీ పాశ్చాత్యుల మహాభారతం అని చెప్పవచ్చును. జాయ్స్ దాన్ని 18 పర్వాలుగా ప్లాన్ చేసి రాశాడు. ఇది ఆధునిక మానవుని మహాభారతం. హోమర్స్ ఒడిసీ ఇంత కాలంలో జరిగింది అని చెప్పడానికి వీలులేని మైథిలాజికల్ టైమ్‌లెస్‌నెస్ కలది. జాయ్స్ ఒడిస్సీ ఒక సామాన్య నగరంలో ఒక సామాన్య మానవుడు గడిపిన 24 గంటల చరిత్ర. ఇందులో ప్రతి ఘట్టానికి అసలు ఒడిస్సీతో పారలల్స్ ఉంటాయి. ఉదాహరణకి గ్రీకు పురాణాలలో యులిసిస్‌కి నౌకాయానం సుఖప్రదంగా సాగడానికి వాయుదేవుడు తుపాను గాలులన్నీ సంచులు కట్టి ఇస్తాడు. నడిసముద్రంలో రాజుగారి నావికులు తమకి తెలియకుండా యజమాని ఏవో మూటలు దాచుకున్నాడని వాటిని విప్పేస్తారు. అప్పుడు పెద్ద తుపాను వచ్చి నౌకాభంగ మవుతుంది. (తర్వాత సైక్లోప్స్ ఘట్టం అనుకుంటా. సైక్లోప్స్ అంటే ఒంటి కంటి రాక్షసులు.) ఈ గాలిదేవుడి (Eolus) ఘట్టాన్ని Joyce ఒక న్యూస్ పేపరు ఆఫీసులో set-up చేశాడు. (న్యూస్పేపర్లంటే Wind-Bags కాబట్టి) ఆ ఘట్టాన్నంతా వార్తాపత్రిక edit చేసినట్టుగానే రాశాడు.

యులిసెస్‌నీ దానికి సంబంధించిన ఇతర గ్రంథాలనీ చదివిన తర్వాత పెన్నిగన్స్ వేక్ చదవడం మంచిది. "A skeleton key to FW" అని ఒక పుస్తకం FW ని అర్థం చేసుకోడానికి తోడ్పడుతుంది.

యులిసెస్‌లో duration of time ఇరవై నాలుగు గంటలైతే FW ది ఒక క్షణం.

Ulysses examines the human condition.

Wake explores the human dream. FW తర్వాత జాయ్స్ మహాసముద్రం మీద ఒక epic వ్రాయాలనుకున్నాడట. యులిసెస్ రచనకి 7 సంవత్సరాలుకాగా, FW రచనకి 21 సంవత్సరాలు కష్టపడ్డాడు. ఈ లెక్కని 21x3=63 సంవత్సరాల్లో ఆ పుస్తకం ముగిసేదేమో!

చనిపోడానికిముందు Dylan Thomas ఒక సముద్రతీర గ్రామం గురించీ ఆ గ్రామవాసుల గురించీ ఒక రేడియో నాటకం వ్రాశాడు. Joyce ఇన్ఫ్లుయెన్స్ అందులో స్పష్టంగా కనబడుతోంది. ఈ నాటకం ప్రారంభం :-

(Silence)

First voice :- (Very Softly)

To begin at the beginning......

From where you are, you can hear their dreams.

ఈ విధంగా సాగుతుంది నాటకం. దాని పేరు Under milk wood.

యువర్స్ సిన్సియర్లీ,

శ్రీశ్రీ

## 54

Madras,
31-8-57

Dear P.A.S.

"చరమరాత్రి" కాపీలు అందాయి. చాలా అసంతృప్తి కలిగింది. అన్ని హక్కులూ గుప్తా బ్రదర్సువని ఎందుకు ప్రకటించుకున్నారో బోధపడలేదు. ఇది దారుణం, రాక్షసం! (అని నా అభిప్రాయం) పరువు గల పత్రికలకు సమీక్షార్థం రెండేసి ప్రతులు పంపండని నా తరపున గుప్తా సోదరుణ్ణి ప్రార్థించగోరుతా. ఇదివరకే పంపించి, ఏవైనా రివ్యూలు వస్తే, ఆ కటింగ్సు కాని, కనీసం పత్రిక పేరు, అది వెలువడ్డ తేదీ గాని నాకు అందజేయగోరుతాను. ఇవి ముద్రాపకుని కనీస ధర్మాలు. నాకింకా రావలసిన డబ్బుంటే అది పంపమనండి. మీ address కూడా తెలియజేయండి.

Sincerely Yours,

Sri. Sri.

## 55

Madras,
9-1-58

Dear P.A.S.

మీ ఉత్తరం అందింది. కారు కొనడం, ఇల్లు కట్టిస్తూండడం నిజమే కాని నేను చెప్పేస్తే మీ మిత్రుడు స్టార్ అయిపోవడం (ధనార్జనకి కాదు సరదాకి) నిజానికి కొంచెం దూరమే మరి! అంతేకాక నేను ఫలానావారిని ఫలాని వేషానికి తీసుకొండని సిఫారసులు చేసే అలవాటు పెట్టుకోలేదు. దీనికి చాలా కారణాలున్నాయి. రాయడానికీ కార్డు చాలదు. బహుశా ఈ నెలాఖరులోగా నేను హైదరాబాదు రావచ్చును. ఈ సంగతులు, ఇంకా 11-1-58 ఎన్నో విషయాలూ ముఖస్థంగా మాట్లాడుకుందాం. సోదరుడు ఖాసింఖాన్‌కి నా best wishes అందజెయ్యండి.

Sincerely Yours,

Sri. Sri.

---

*1. ధనార్జన విషయంలో మాత్రం ఈ కాలం, శ్రీశ్రీ మొత్తం జీవితంలోనే ఉచ్ఛదశ, 'డబ్బింగ్ కింగ్' అనిపించుకొని చాలా డబ్బు గడించాడు. అయితే ఆ సిరి 'కరిమింగిన వెలగపండు కరణి'ని పోయింది.*

---

## 56

Madras,
4-2-58

Dear Venkata Ramayya Garu

Your letter and Kaloji's poem. What you have said about the poem is quite true. It is certainly in very bad taste. We cannot publish it in Abhyudaya.

At present I have a lot of work pending. Shall try to find time to write an article for Abhyudaya. I could manage a little liesure at Hyderabad but I am not able to leave this place. I have three dubbing pictures on hand each demanding my all-out attention. So that is that.

Sincerely Yours,
Sri. Sri.

*1. ABHYUDAYA was the organ of the ANDHRA ABHUDAYA RACHAYITALA SANGAM (Progressive Writers' Association) Started as a monthly in October 1946, it ran for more than a year until it was virtually killed after July 1948 when the Government of Madras unleashed a policy of repression against the 'front' organisations of the CPI Later it was revived in January 1956 as a Quarterly and soon it became a monthly in April 1957. Sri Tummala Venkata Ramayya, the General Secretary of APWA was the chief editor of ABHUDAYA in its second life.*

## 57

Madras,

Dear Venkata Ramayya garu 12-6-58

మీరు వెళ్ళిన తర్వాత గురజాడ గీతాల సంపుటి పంపిస్తానన్నారు. Introduction కోసం వైరు వచ్చింది. మీరు వెంటనే పంపిస్తే వచ్చేవారం Intro రాసి పంపిస్తాను. నేనిచ్చిన Cheque cash అయివుంటుందనుకుంటాను. ఏ కారణం వల్లనైనా అవకపోతే మళ్ళీ present చెయ్యండి.

Sincerely Yours,

Sri. Sri.

## 58

Madras,

Dear Venkata Ramayya garu 19-6-58

"ముత్యాల సరాలు" అందింది. ఒకటి రెండు రోజుల్లో పరిచయం వ్రాసి పంపిస్తున్నాను. చెక్కు కాష్ అయి ఉంటుందనుకుంటాను. జవాబు వ్రాయండి. హైదరాబాదు కళాశాల సంచిక పంపిస్తానన్నారు. ఒక కాపీ పంపగోరుతాను. వచ్చేనెల మొదటి వారంలో హైదరాబాదుకు వెళ్ళటానికి వీలవుతుందనుకుంటున్నాను.

Sincerely Yours,

Sri. Sri.

## 59

Madras - 28

Dear Venkata Ramayya garu 24-4-59

మీ 22వ తేదీ ఉత్తరం అందింది. సినీమా ప్రదర్శనం విషయమై అనిసెట్టితో సంప్రతించి రాస్తాను. స్టాక్‌హోం సమావేశానికి వెళ్ళాలనే అనుకుంటున్నాను. కాని ఇక్కడ పనుల ఒత్తిడి చాలా జాస్తీగా ఉంది. వెళ్ళితే మార్చి 3వ తేదీని ఇక్కడి నుండి బయలుదేరి 4కి ఢిల్లీలో ఉండాలి. అక్కడనుంచి డెలిగేషన్ 4వి బయల్దేరుతుంది. 8 నుంచి 23 వరకు స్టాక్‌హోం సమావేశం. కాబట్టి బాపట్ల ఫంక్షన్‌కి రావడానికి వీలుండదు. "ఖడ్గసృష్టి" సావు ప్రతి ఒకటి తయారు చెయ్యాలనుకుంటున్నాను. స్టాక్‌హోంకి వెళ్ళేదీ లేనిదీ ఈ నెలాఖరుకి గాని definiteగా తేల్చుకోలేను. వస్తున్నానని ఉత్తరం మాత్రం ఢిల్లీ peace council కి వ్రాశాను. ఈలోగా ఇక్కడ చాలా details చూసుకోవలసినవి ఉన్నవి.

Sincerely Yours,

Sri. Sri.

## 60

Madras.

Dear Venkata Ramayya garu, 1-5-59

I am going to Stockholm on the 5th On the 3rd night I am starting for Delhi. So please inform our Bapatla friends about my inability to attend their function.

Most probably I shall be returning on 15th or thereabouts.

Sincerely Yours,
Sri. Sri.

## 61

Madras

Dear Venkata Ramayya garu 30-6-59

ఈ ఉత్తరం ఒక ముఖ్యమైన విషయం గురించి వ్రాస్తున్నాను. కస్తూరి ఫిలిమ్స్‌వారి "నాన్ సొల్లుం రహస్యం" నేను తెలుగులోకి డబ్‌చేశాను. ఈ ఉదయం ఆఖరిపాట రికార్డు చెయ్యడంతో డబ్బింగు వర్కు పూర్తి అయింది. జూలై 9వ తేదీని సెన్సార్ చేయించాలి. జూలై 15వ తేదీని విడుదల. ఈ పిక్చరులో నాకూ కస్తూరి ఫిలిమ్సుకూ partnership ఉంది. డిస్ట్రిబ్యూటర్లతో నిమిత్తం లేకుండా నా దగ్గరున్న కొంత డబ్బుతోను ఎక్కువభాగం టెక్నిషియన్లు ఆర్టిస్టులు మున్నగు వారి సహకారంతోను పని ముగించాను.

ఇప్పుడు నేను కోరేది విశాలాంధ్ర (శుక్రవారం 3వ తేదీ)లో ఒక full page advertisement వెయ్యాలి. బ్లాకులూ ఏమీ అక్కరలేదు. వెనుక పేజీలో write-up రాస్తున్నాను. ఆ ప్రకారం వేసి అరడజను కాపీలు advertising bill తో సహా ఉషశ్రీ పిక్చర్స్ చిరునామాకు పంపగోరుతాను. శ్రీశ్రీ అనే అక్షరాలూ, పిక్చరు టైటిలూ (చెవిలో రహస్యం) పోస్టరు టైపులో వేయించండి. మిగిలినవన్నీ హెడ్డింగు టైపులో అంతకు తక్కువ టైపులో వేయించండి.

నవయుగా వాళ్ళను డిస్ట్రిబ్యూషను తీసుకొమ్మని నెల్లాళ్ళ కిందట (పని ప్రారంభించక ముందు) అడిగితే 1960లో గాని వీలులేదన్నారు. ఇప్పుడు నేనీ పిక్చరును జూలై 15, 1959లో విడుదల చెయ్యించదలచుకున్నాను. ఏ డిస్ట్రిబ్యూటరుకైనా నేను విధించే మొదటి షరతు ఇదే.

మీ జవాబు ఇంటి అడ్రెసుకి వ్రాయండి. శుక్రవారం "విశాలాంధ్ర" కోసం ఎదురుచూస్తూ ఉంటాను.

యువర్స్ సిన్సియర్లీ
శ్రీశ్రీ

1. 'చెవిలో రహస్యం' పేరుతో ఈ చిత్రం విడుదలై బాగా నష్టపోయింది. మాటలు, పాటలు శ్రీశ్రీ రాశాడు. డైరెక్షను ఏ. శ్రీధరరావు, ప్రొడ్యూసర్ వి.సి. సుబ్బరామన్.

## 62

మద్రాసు

డియర్ వెంకటరామయ్యగారు, 3-7-59

విశాలాంధ్ర అందింది. కుటుంబరావుగారు అన్ని విషయాలూ చెప్పేరు. ఫుల్ పేజికి వీలులేదు కాబట్టి ¼ పేజ చాలుననుకున్నాను. 10వ తేదీలోగా పిక్చరు సెన్సారవుతుంది. బహుశా పూర్ణావారు

డిస్ట్రిబ్యూషను తీసుకుంటారు. సకాలంలో ప్రచురణ చేసినందుకు విశాలాంధ్ర మేనేజ్‌మెంట్‌కి నా కృతజ్ఞత తెలుపండి.

బిల్లూ, ఆరు కాపీలూ త్వరలోనే పంపెంచగలరనుకుంటాను.

ఇందులో ఒక రచన పంపుతున్నాను. "అభ్యుదయ"లో వ్యవధి ఉంటే వెయ్యండి. లేకపోతే డైలీ లోనే వెయ్యవచ్చు. మీ అవకాశం ప్రకారం.

యువర్స్ సిన్సియర్లీ

శ్రీశ్రీ

*1. ఇందులో పంపిన రచన 'కేరళలో శగట్లు లేక వెర్రిరాజుకి ఆటకట్టు" ఈ రెండవ శీర్షికను omit చెయ్యమని శ్రీశ్రీనే రాశాడు.*

# 63

**తుమ్మల వెంకటరామయ్యకి**

మద్రాసు

డియర్ ఫ్రెండ్,

21-7-59

ఇందులో "పరిచయం" పంపిస్తున్నాను. చాలా ఆలస్యమయిపోయింది. ఊపిరి సలపని పనుల తొందర! ఇన్‌కమ్‌టాక్స్ గొడవలు. చాలా చిరాగ్గా ఉంది. విపులంగా పరిచయం రాయాలనుకున్నాను. కాని సూక్ష్మంలో ముగించవలసి వచ్చింది.

అందినట్లు వెంటనే జవాబు వ్రాయండి.

శ్రీశ్రీ

*1. కె.వి. రమణారెడ్డి గేయ సంకలనం "అంగారవల్లరి"కి శ్రీశ్రీ 'పరిచయం' రాశాడు. ఆ పుస్తకాన్ని ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం వారు ప్రచురించారు.*

# 64

మద్రాసు

23-7-59

డియర్ వెంకటరామయ్యగారు,

"అంగారవల్లరి"కి పరిచయ వాక్యాలు సోమవారం పోస్టు చేస్తున్నాను. పని తొందరలో ఊపిరి సలపలేదు. పైగా మా పిక్చరు "చెవిలో రహస్యం" డిస్ట్రిబ్యూషను ఇంకా కుదరలేదు. మన "నవయుగ" మిత్రులతో మీరు మళ్ళీ ఏమైనా మాట్లాడగలరా? ఇదివరలో 1960 వరకు వీల్లేదని నాతో అన్నారు. ప్రస్తుత పరిస్థితి ఏమిటో కొంచెం కనుగొన గోరుతాను. 20వ తేదీని సెన్సారుకూడా అయింది. నో కట్స్, రిలీజుకు సిద్ధంగా ఉన్న చిత్రం. టెరమ్స్ విషయం అడిగితే నామినల్ ఎడ్వాన్స్ ఇచ్చి 8 లేక 10 ప్రింట్లు+పబ్లిసిటీ అని చెప్పండి. విశాలాంధ్రలో పడిన ఎడ్వర్‌టైజ్‌మెంట్ బిల్లు నా పర్సనల్ ఎడ్రస్‌కి పంపించండి.

కేరళ విషయమై అభ్యుదయ రచయితల సంఘం తరపున ఒక స్టేట్‌మెంట్ ఇవ్వడం గురించి మీ అభిప్రాయం ఏమిటి? మీరే డ్రాఫ్ట్ చేసి మనందరి తరపునా పత్రికలకి ఇవ్వండి.

సిన్సియర్లీ యువర్స్,

శ్రీశ్రీ

# 65

Madras,

Dear Mr. Tummala, 29-8-59

Your letter Sorry for the delay. I shall be definitely sending the introduction to Sri Ramana Reddy's poems on Monday. Also the cheque for the advertisement in Visalandhra. Mr. Sunderlal is taking the distribution of my picture.

Sincerely Yours,

Sri. Sri.

---

*These poems were collected under the name of ANGARAVALLARI (A bunch of fire-blossoms) with Sri Sri's introduction It was published by the ABHYUDAYA RACHAYITALA SANGHAM in September, 1959.*

*Sri Sri invested his hard-earned money in dubbing a Tamil Picture into Telugu - Chevilo Rahasyam, under the banner of Kasturi Films. It was a flop*

---

# 66

Madras,

Dear Mr. Tummala, 17-11-59

I received your wire at 11 P.M. and immediately contacted our friend Mr. Kavuluri. I shall be going to Bezwada either on the 28th or 29th. You decide yourself whether I should preside or inaugurate. I shall talk to Anisetty about the "Abhyudaya affairs" and write to you again.

Sincerely Yours,

Sri. Sri.

---

*ABHYUDAYA was not a good business proposition from the beginning. It's finances were slender, and subscribers numbered only hundreds It had to go begging every now and then Sri Sri, as president of APWA, generously came to its help. The funds raised by Madras city unit of PWA were with Anisetty Subba Rao. He was therefore the person whom Sri Sri had to contact from time to time for the APWA in running ABHYUDAYA*

---

# 67

Madras,

Dear Mr. Tummala, 18-11-59

Hope you've received my letter of 17th. From Bezwada I shall be going to Hyderabad for Gurajada Vardhanti. So I shall stay for only one day at Bezwada. Kindly arrange my programme accordingly. I shall have to be at Hyderabad on the 30th.

I have not yet met Anisetty. We both had planned to see Sunderlal in connection with the film show.

Shall write to you again.

Sincerely Yours,

Sri. Sri.

## 68

Madras,
24-11-59

Dear Mr. Tummala,

I am trying my best to attend the functions at Bezwada and Hyderabad. But my situation here is very awkward. Firstly, I have to complete the dubbing of a picture before the end of this month. (If not, their raw film permit will lapse) Secondly I am having trouble with income tax people. And there are other troubles and proceupations. Still I am trying to keep up the engagements. But it is better to make alternate arrangements for the students' festival.

Sincerely Yours,
Sri. Sri.

## 69

మద్రాసు
20-2-61

**మై డియర్ తుమ్మల**

లుమంబా గీతం ఇంకా విశాలాంధ్రలో వచ్చినట్టు లేదు. "లమంబా" అనకుండా లుమంబా అనే టైటిల్‌లో ఉంచండి.

ఆఫ్రో-ఏషియన్ రచయితల సమావేశానికి వెళ్ళితే ఇక్కడ అఖిల భారత సదస్సు మిస్ కావలసి వస్తుంది. ఆ విషయం మీరేమీ రాయలేదేం?

హౌ ఎబౌట్ పుట్టపర్తి?

నిన్న డా. రాజారావుగారింట్లో వేములపల్లి శ్రీకృష్ణగారు మన ఫ్రెండ్స్ అందరినీ ఎడ్రస్ చేశారు. నేనూ వెళ్ళాను. వివరాలు మీకు అందే ఉంటాయి.

అభ్యుదయ విషయమై అనిసెట్టితో కూడా సంప్రతించి రాస్తాను.

యువర్స్ సిన్సియర్లీ
శ్రీశ్రీ

---

*1. ఆసియా - ఆఫ్రికా రచయితల మహాసభ :- తొలిసభ కొత్త ఢిల్లీ (డిశెంబరు 23-30, 1956)లో జరిగింది. తెలుగు ప్రతినిధి వర్గంలో శ్రీశ్రీ (నాయకుడు), కాళోజీ (ఉపనాయకుడు) లతో పాటు వట్టికోట ఆళ్వారుస్వామి, గిడుతూరి సూర్యం మొదలైనవారున్నారు.*

## 70

Madras,
11-12-61

**తుమ్మల వెంకట రామయ్యకి**

My dear Friend,

Thanks for your letter and kind enquires. I am quite all right. I have already written a letter to the Editor "Visalandhra". I had already identified the man who attacked me. He is a congress assembly candidate and he was fully drunk at the time of the assault. My lost property is restored to me but the Russian Camera is very badly damaged.

Shall write to you again at length.

Sincerely Yours,
Sri. Sri.

P.S జరిగింది సాహిత్య యుద్ధం కాదు,

రాజకీయ రభస మాత్రమే! - S.S.

*1 These "kind enquiries" related to an ugly incident in which Sri Sri was involved at Kakinada. He had been to that place to address a students' meeting. In the evening when he was ascending the stairs to go to his hotel-room, some ruffians laid violent hands on him and manhandled him, damaging the camera which he was carrying. They were the hireings of a congress boss of the neighbourbood. He was enraged at the reported remarks of SRI SRI about misuse of the Panchayat Samiti property like jeeps by non-officials. This incident created quite an uproar in the press*

# 71

Madras,
27-1-62

Dear **చలం మహర్షి,**

మీరు అనుమతి నిరాకరించడం సమంజసంగాలేదు.

ఈనాడు నేను నిర్ధనుణ్నేకాక ఋణగ్రస్తుణ్ని. కాని ఎవరి అప్పులూ నేను ఎగగొట్టను. పోతే నెల్లాళ్ళో రెండు నెలలో వాయిదా అడుగుతాను.

రుక్మిణీ కల్యాణం కొంతమంది మిత్రుల సహాయం వస్తుందనుకొని ప్రారంభించాను. ఆ మిత్రులలో మీరూ ఒకరని ఇప్పటికీ భావిస్తున్నాను. మీ చేత కొన్ని సీనులు రాయించుకోవాలని ఇప్పటికీ అభిలషిస్తున్నాను. అందుకే మిమ్మల్ని మద్రాసుకి ఆహ్వానించాను. సరే మీ కిష్టంలేదు. నా ఆర్థిక పరిస్థితి బాగుపడగానే డబ్బు తీసుకొని నేనో నా తరఫుమనిషో మీ సందర్శనం చేసే అవకాశం నాకు లభించేలా ఆశీర్వదించండి.

నా దురదృష్టం ఏమిటో నాకు బాకీలున్న వారెవరూ బాకీ చెల్లించరు. నేను బాకీ ఉంటే మాత్రం నాకు ఊపిరి సలపనివ్వరు (చలం మహర్షితో సహా!)

ఇంతకూ మీరు నాతో సహకరించడానికి ఒప్పుకున్నట్టా? ఒప్పుకోనట్టా? ఒప్పుకుంటే ఏ షరతుల మీద?

Sincerely Yours,
Sri. Sri.

# 72

Madras,
11-8-62

Dear Mr. Tummala,

Yours of the 9th inst. I am starting on Monday by Grand Trunk to Bezwada from where I am going to Bhimavaram to partake in August 15th function. So we can have a personal talk at Bezwada I shall bring with me the collections'[1] I have made.

Sincerely Yours,
Sri. Sri.

*1. These collections were for keeping Abhyudaya going. These were made at Madras, mainly from the film people.*

# 73

10-6-65

KALURI VENKATA NARASINGA RAO *

"... ............ .. Perhaps in matters of poetry we have travelled too far away from each other in opposite directions. You are the master of the classical verse and I champion the cause of spoken Telugu and Desi metres and even no metre at all. Ideologically I think your view point is nationalist-idealist, whereas mine is realist-internationalist with all these polar and sub-lunar is found. Thus I do not like Vishwanatha's orthodoxy but it does to your poetry, it only suffices for me to say that most of them I know by heart, so much so that some of the recent corrections you made in the original text of your poems —possibly as a concession to Grandhic grammar – I view altogether with disfavour. You know Sri Rayaprol's "పావనదీవెనాచయము ", which we all liked but which he corrected in his collected volume. Even now I think the so called dushta-samasa is sweeter then the corrected one.

So for the present, I hope to write to you again soon-very soon.

Sincerely Yours,

Sri. Sri.

---

** Sri Kaluri Venkata Narasiga Rao is a practicing lawyer of Visakhapatnam. He gave up poetry for law long, long ago As a law student at Madras between 1928 and 1930 he found a kindred soul in SRI SRI, then studying B Sc. at Christian college, Madras. They both share at that time a great admiration for the poetry of Sri Viswnatha Satyanarayana, which SRI SRI shed but Kaluri has retained.*

*Sri Kaluri brought out two volumes of his early poetry in 1965 - LAVALI DALALU and ANVESHANA. It was on that occasion that SRI SRI penned these lines to his former associate. The earlier portion of the letter is omitted The date of the letter is 10 June 1965*

# 74

11, Canal Bank Road,
Madras, 28.

ద్వారం జగన్నాధరావుకి

My dear Jagannadha Rao, 23-11-1966.

Excuse me for my not having replied your earlier. You know how it is. With the greatest trouble and expense I flew to Delhi to receive the award. The function was a great success. Yesterday's issue of (Visalandhra) Telugu Daily has printed a photograph which you might have seen. I think Prabha and Patrika were sent the photos but I Don't know if they are published or thrown in the waste paper basket.

Anyhow, my financial worries are temporarily at an end. I am not completely out of the woods but there is some peace of mind at last. I was thinking of "shifts" to Hyderabad, ultimately to settle down at Bhimili. My plan is still there.

Sorry I could not meet our friend Achari. Hope all our friends there are o.k. Do please write to me again.

Sincerely Yours,
Babai.

I'll be going to Russia next year probably in May.

## 75

మద్రాసు
1966

డియర్ వెంకటరామయ్యగారూ!

"సదసత్సంశయం" 10, 11, 12 పంపుతున్నాను. పని ఆలస్యం కాకుంటే continuous గా వెయ్యండి. లేకుంటే ఫర్వాలేదు. 10-11 12 రా. రామచంద్రారెడ్డిగారి కొక కాపీ పంపించండి.

రేపు "ఖడ్గసృష్టి" టైటిల్ పోయమ్ పంపుతున్నాను. యూనివర్సిటీ లైబ్రరీకి వెళ్ళి Eluard poem సంపాదిస్తాను. ఇవాళ ఈశ్వరరావును కలిశాను. లెనిన్ కావ్యంలో మొదటి section మీకు పంపించే ఏర్పాట్లు చేస్తానన్నాడు.

నాకు రైలు పెట్టెలో మన్యంగారు ఎంత ఇచ్చారో తెలియదు. రైలు ఛార్జీలు నలభై పోను 160 రు. ఇచ్చారనుకుంటాను.

'ఖడ్గసృష్టి' నళినీకుమార్‌కి అంకితం ఇద్దామనుకుంటున్నాను. మీకు నచ్చిందా?

విషయసూచికకు ముందు పేజీలోనే భీమకవి పద్యం వెయ్యండి. కొటేషన్ మార్కుల్లో ఉంచితే కిందని మళ్ళీ రాయనక్కరలేదు.

యువర్స్ సిన్సియర్లీ
శ్రీశ్రీ

## 76

Madras,
19-12-67

My Dear PAS,

మీ ఉత్తరానికి కృతజ్ఞత. కవితా సమితి[1] 41వ వార్షికోత్సవానికి రావాలనే ఉంది. అయితే ఇక్కడ పరిస్థితులూ కార్యక్రమాలూ, ఒత్తిడులు ఎలా వుంటాయో ఇప్పుడే చెప్పలేను. పైగా సొంతఖర్చుమీద రాగలుగుతానో లేనో కూడా చెప్పలేను. (ఇది మీకు ఆశ్చర్యకరంగా ఉండొచ్చు. కాని నిజం! రేపే 500 రు. చేతిలోకి రావచ్చు. నెల్లాళ్ళుదాటినా రాకపోవచ్చు. ఇదీ నా పరిస్థితి.)

మీరు నెలాఖరుదాకా విశాఖలోనే ఉంటారా? వార్షికోత్సవానికి రావడానికి శాయశక్తులా ప్రయత్నిస్తాను. 2-1-1968 నా జన్మదినం[2]. (58వ జన్మదినం అన్నమాట.) వస్తే 3, 4 తేదీలదాకా ఆ ప్రాంతాల్లోనే ఉంటాను. రావాలని చాలా ఆకాంక్షగా ఉంది. రాగలుతాననే ఇప్పటిమట్టుకు విశ్వసిస్తున్నాను.

Yours Sincerely,
Sri. Sri.

---

*1. 1926 మే 6న పురిపండా అప్పలస్వామి, శ్రీరంగం శ్రీనివాసరావు, వడ్డాది సీతారామాంజనేయులు కలిసి స్థాపించిన సాహిత్యసంస్థ.*

*2 శ్రీశ్రీ చనిపోయాక కానీ ఆయన జన్మదినం 30.04.1910 అని తెలిసిరాలేదు.*

## 77

Madras,

దిగంబర కవులకి — 17-10-68

Dear Poets,

Hearty congratulations. 3rd Vol. is a real live bomb. I have now with me vols. 1 & 3. The 2nd / only glanced through. Can you send me a copy of the same. Address given overleaf.

Yours,

Sri. Sri.

## 78

మద్రాస్

మై డియర్ దిగంబర కవులారా! — 11-11-68

మొత్తం మీద మీ అందరికీ కలిపి ఈ ఉత్తరం రాస్తున్నాను. అందుకోండి నా ఆశీర్వాదాలు ఫర్ వాట్ దే ఆర్ వర్త్.

మీ రెంతమంది? 6? 8? 68? (బేసి సంఖ్య లేదు సరిసంఖ్య) మీలో సగం మంది ట్వీడిల్డమ్ తతిమ్మా సగం ట్వీడిల్‌డీ! (చూ. ఆలీస్ ఇన్ వండర్ ల్యాండ్)

Sincerely Yours

Sri. Sri.

అసలు సంగతేమిటంటే మీరెందరైనా ఒకటే. వడ్డి విషయం ఏమిటంటే.

మీరు ప్రత్యేక వ్యక్తిత్వాలను సంహరించుకొని, ఒకేఒక సమిష్టి వ్యక్తిత్వాన్ని సాధించారు. అదీ ఈనాడు మీరు, ఈ వరకే సాధించిన విజయం.

మీ దిక్కుమాలిన ఘోషతో దిక్కుల్ని దద్దరిల్లజేస్తున్నారు.

But it is no use praising you, or patting you on the back.

(శ్రీశ్రీ మమ్మల్ని మెచ్చుకుని ఉత్తరం రాశాడంటూ మీరు పబ్లిసిటీ పంపులు కొట్టించుకునే స్థితిలో లేరు. ఆ దశ మీరు ఏనాడో దాటి పోయారు.)

But listen, I don't want to command you, or recommend you, or condemn you or curse you. I want to translate you into English find a publisher with guts and an illustrator with imagination.

I am
Yours Sincerely,
Sri Sri, (అనగా తెలుగులో శ్రీశ్రీ)

*ఉత్తరం చివర సంతకం తలకిందులుగా పెట్టడం ఒక విలక్షణత. కాగితం అందుబాటులో లేక కాబోలు, ఆం.ప్ర. సాహిత్య అకాడమీకి జరిగే ఎన్నికల బ్యాలెట్ పేపర్‌మీద ఉత్తరం రాశారు.*

*1. ట్వీడిల్డమ్, ట్వీ డిల్డిడీ - రెండు వస్తువులమధ్యగానీ, ఇద్దరు వ్యక్తుల మధ్యగాని ఎక్కువ పోలికలుండి కేవలం పేర్లలో మాత్రమే తేడావుంటే ఇలా అంటారు. హాండిల్, బోనాన్సిన్ అనే ఇద్దరు వాగ్గేయకారులని వర్ణిస్తూ, జాన్ బైరాన్ (1723-86) వ్యంగ్యంగా వాడిన మాటలివి.*

# 79

Madras,
18-8-69

Dear PAS,

మీ ఉత్తరం అందింది. గిరీశం బుచ్చెమ్మతో చెప్పినట్లుగా నాట్ ది స్లైటెస్ట్ అబ్జక్షన్ అనగా యంతమాత్రమూ అభ్యంతరం లేదు.

వచ్చేనెల మొదటి వారంలో విశాఖపట్నం వస్తున్నాను. అన్ని విషయాలూ అక్కడ ముఖస్థంగా మాట్లాడవచ్చును.

రా.వి.శాస్త్రి గారితో కలిసి మీరు వ్రాసిన ఉత్తరానికి నా జవాబు అందిందనుకుంటాను. అందులోనే మసూనా గారి ఉత్తరం గురించి కూడా వ్రాశాను.

కవితాసమితి తరఫున అనకాపల్లిలో ఒక ఉపన్యాసం బాకీ ఉన్నాను. చాలా కాలం కిందట 40రూ॥ నాకు పంపించారు కూడా. సెప్టెంబరు ట్రిప్పులో ఆ బాకీ తీర్చుకుందామనుకుంటున్నాను. మీరు కూడా వస్తే కలిసి అనకాపల్లి వెళదాం.

Yours Sincerely,
Sri. Sri.

# 80

Madras,
16-12-1969

**చలసాని ప్రసాద్‌కి**

My dear Mr. Prasad,

I am writing this letter on an urgent matter. With regard to the house, No. 11 Canal Bank road, my wife is in arrears for the last one year. With penal interest etc. it was nearly 1000 Rs. even two months ago. Eviction notice may be served any moment now.

Can you kindly make out a cheque for Rs. 1500/- (Fifteen Hundred rupees) in the name of Mrs. Srirangam Venkata Ramanamma & send the same at your earliest convenience? or better still, a cheque for Rs. 1000/- in the name of "The Rajah Annamalaipuram Co-operative House construction society Ltd., Madras - 28" and another in the name of Mrs. S.V. Ramanamma for 500 Rs. and send both the cheques to me per registered post?

I am going to Bezwada tomorrow (to attend a function at Nandigama College) and I shall be returning to Madras by 20th morning.

If, for any reason, you couldn't comply with my request, kindly send me a telegram care, Visalandhra publishing house, Vijayawada.

Sincerely yours,

Sri. Sri.

## 81

Madras,

20-12-1969

My dear Prasad,

Many thanks for timely help. I returned from Vijayawada . But my wife received your previous letter yesterday. Society arrears amounted to Rs. 1245/ - The balance will go a long way to meet corporation arrears etc.

Thanking you once again.

Sincerely yours,

Sri. Sri.

## 82

ఏ. సోమసుందర్‌కు - 18-8-1969

మొన్న కవి సమ్మేళనం విద్వాన్ విశ్వం ఆధ్వర్యాన జరిగింది. "శరచ్చంద్రిక" మాత్రమే చదివాను. అంతకుముందు ఆరుద్ర మాట్లాడుతూ ఇటీవల ఒకాయన నవగ్రహశాంతి చేయిస్తూ చంద్రుణ్ణి మాత్రం మినహాయించాడనీ, ఈ విధంగానైనా మూఢనమ్మకాలు తగ్గుతున్నాయనీ అన్నాడు. తగ్గడంలేదేమోనన్న నా అనుమానాన్ని వ్యక్తం చేస్తూ ఆ మధ్య ఒకాయన "హిందూ" కి వ్రాస్తూ అమెరికా వాళ్ళు దైవభక్తి పరులు కాబట్టే చంద్రవిజయం సాధించారన్న విషయం పేర్కొని "అమెరికన్ విజయానికి అంతకు ముందు జరిగిన నరబలులు (కెన్నెడీ, కింగ్ ఇత్యాదయః) కారణమ"ని నాకు తోచిన సలహా నేనిచ్చాను. అంతేకాదు. అమెరికాలో అనుక్షణమూ జరిగే హత్యలూ, ఆత్మహత్యలూ ఇలాంటి వాటినన్నిటినీ గాలికిపోయిన పిండి కృష్ణార్పణం అన్న బాపతుగా నా సలహాని జమకట్టుకోవచ్చునన్నాను. చంద్రవిజ్ఞానానికి నేనేమీ పడకపోయినా, మూఢవిశ్వాసాలకు కొద్దిగా నైనా తోడ్పడగలిగినందుకు సంతృప్తి కలిగింది. ప్రపంచం ఉన్నంతకాలం మూఢులూ వుంటారు. విశ్వాసాలు వుంటాయి. అమెరికా భక్తుల ఆత్మానందానికి మనమెందుకడ్డుతగలాలి? కళాకేళి బాగా నడిపిస్తున్నందుకు నా అభివందనాలు.

ముద్రణ : కళాకేళి, సెప్టెంబరు, అక్టోబరు - 1969

Sri. Sri.

## 83

నిఖిలేశ్వర్‌కి

Madras,

3-1-1970

Dear N

ThankQ for your 1-1-70 greetings. I heartily reciprocate. I have already seen Poet.[1] It's well done, personally, I want that all my DIK[2] renderings should

appear in a separate book form But Sri Ramana Reddi wants that at least a few should appear in my collected works I have not yet made my mind but probably may send six poems or even less. I may be in H'bad on 11th inst — in connection with 'మనుషులు మారాలి' function

Sincerely yours,

Sri. Sri.

---

1 *POET = మద్రాసునుండి డా॥ కృష్ణశ్రీనివాస్ సంపాదకత్వంలో వెలువడే ఇంగ్లీషు మాసపత్రిక. దిగంబర కవుల అనువాదాలతో ఒక ప్రత్యేక సంచిక 1969లో వేసింది ఆ సంచికకు ప్రత్యేక సంపాదకుడిగా నిఖిలేశ్వర్ వ్యవహరించారు.*

2. *DIK = దిగంబర కవులు.*

---

# 84

Madras,

Dear Prasad garu, 11-6-70

Hope you've reached Vizag by now. Kindly reply to Sri Sri 2/19A, South Bank Rd., Mds-28. Saroja and children are here. I am thinking of educating the children here. Is it possible for you to come over here before the end of this month? I'll be at H'bad on 3rd, 4th, 5th July.

American poem[1] is returned by Visalandhra. I sent it to Pro-Chinese "ప్రభంజనం" of Proddutur. A Hindi version of my Nehru poem is broadcast on 9th of this month. I shall publish the full version in 'నవత'. Am writing many. లిమబుక్కులు How is SSS financial position? Can you send a draft in the name of Mrs. U. Saroja, on Andhra Bank.

*తెల్ల కమ్యూనిస్టులు*
*రక్తపాతానికనిష్టులు*
*ఇందిరారాధనలో శ్రేష్టులు*
*నవభారత ధార్తరాష్ట్రులీ రివిజనిస్టులు*

Sincerely yours,

Sri. Sri.

*American Poem :- పేరు 'అరేయ్! అమెరికన్ సామ్రాజ్యవాదీ' ఈ కవిత ఇలా మొదలవుతుంది*

*తొడలు విరిగిన దుర్యోధనా*
*తోక తెగిన గుంటనక్కా*
*పిచ్చిపట్టిన కొండముచ్చూ*
*పుచ్చిపోయిన సవాయిరోగీ*

*'ప్రభంజనం' పక్ష పత్రిక (15-6-1970)లో అచ్చయింది. సిప్రాలి (శ్రీశ్రీ సాహిత్య సర్వస్వం-14 - ప్రచురణ నవంబరు 1987) లో 86వ పేజీలో చోటుచేసుకుంది.*

# 85

మద్రాసు

My Dear Nikhileswar, 7-7-70

మీ నిన్నటి లేఖ అందింది Thanks. విరసం ఏర్పడినందుకు సంతోషాన్ని ప్రకటిస్తూ చాలా మంది నుంచి ఉత్తరాలూ, టెలిగ్రాములూ వస్తున్నాయి. ఖమ్మం జిల్లాలో మన సంఘం విశ్వరూపం ధరించగలదు. ఆగస్టునెలలో ఏ తేదీలలో పెట్టినా, నేను రావడానికి సిద్ధమే. అయితే ఒక వారం, పది రోజులు ముందుగా నాకు తెలియజెయ్యండి.

అధికార పత్రికతోబాటు, "క్ష్వేళ" అనే పేరిట మూడు నాలుగు నెలల కొకసారి ఒక్కో కవితా సంకలనం ప్రకటిస్తే బాగుండదూ.

ఒక చిన్న (మినీ) పిచ్చి ఊహః నిజమైన, శాస్త్రీయమైన సామ్యవాదం మనదేశంలో ఏర్పడేదాకా రోజుకి ఒక్కపూట మాత్రం భోజనం చేస్తూ, నెలకోరోజు ఉపవాసం ఉండడం!

దిగంబర కవుల తర్జుమా త్వరలో ముగిస్తా.

నెహ్రూ poem కి final touches ఇస్తున్నా.

Mother of my four children మినీ నక్సలైట్ కులాసాగా ఉంది. నాలుగైదు రోజుల్లో నాగపూర్‌వెళ్ళి ఖమ్మం సభలకి వస్తుంది.

నా "సదసత్సంశయం" తీరిపోయిందనీ, ఇప్పుడు నాది అనీశ్వరవాదమనీ ఆ మధ్య చలం గారికి ఉత్తరం రాశాను. నా ఉద్దేశంలో ఈనాడు దేవుడే most cruelly exploiting capitalist. ఈ కేపిటలిస్ట్‌తో మనం రాజీలేని, విశ్రాంతిలేని పోరాటం సాగించాలి.

*పడవలు తగలేశాను. బాణం వింటిని వదలి మింటిదిక్కుగా దూసుకుపోతోంది.*

కుటుంబరావుగారికి ఫోన్ చేస్తూ "హైద్రాబాదు నుంచి వచ్చిన తర్వాత అభ్యంగనస్నానం చేసినట్లు ఫీలవుతున్నా"నని చెప్పాను. కుళ్ళు వదిలిపోయింది. Good riddunce.

Sincerely yours,

Sri. Sri.

సర్రియలిజం *ancestors* లో ఒకరైన *Les chants du Meldoror* , వ్రాసిన, 24వ ఏటనే మరణించిన *(1846-1870) comte de Lautra Mont* అనే *Pen name* ధరించిన *Isidore Ducasse* నూరేళ్ళ కిందట ఇలా అన్నాడు : *A catte hauve nomeaux trissons. At this hour there are new shivers running through the intellectual atmosphere.*

వాటిని *face* చేసే ధైర్యం కావాలన్నాడు.

"మంటలు మాటాడుతున్న
రక్తం రాగాలాపన చేస్తున్న
రోజులివి" అంటూన్నేను.

yrs Sri. Sri.

## 86

Madras,

My dear Prasad, 17-8-70

No letters from you. Nor have you sent the drafts as promised. What is the position now? The Madras Housing Board fellows have mislaid Saroja's file. She has left for Nagpur to-day & will be here next month. Kindly let me know when you are coming to Madras next month. I am starting for Delhi on Thursday (if by train) or Friday (if plane). Kindly send a draft for 500 Rs. of a crossed cheque for 500 Rs. both in the name of Mrs. S. Venkataramanamma, 11 canal Band Rd, Madras 28. She has a savings bank a/c with Indian Bank. R.A. Puram. Please see that they reach here on Thursday. Also, send a crossed cheque to Mrs. U. Saroja for Rs. 500/-

C/o. Agent, Andhra Bank, Mylapore, Madras-4.

I have sent a poem ఝంఝ to Srjana. I have to send Rs. 100/- to Nikhileswar after receiving your draft. Also to buy ticket to Delhi.

On 2nd Sept. I'll be at Warangal.

Kindly treat this letter as urgent. Drop a line or two in reply.

Sincerely yours,
Sri. Sri.

## 87

నిఖిలేశ్వర్ కు

Madras,

Dear Nick, 21-8-70

Thanks for your letter. I am in a hurry preparing to fly to Delhi (today or tomorrow, I have not yet decided) to take part in Lenin Symposium.

Have seen the enclosed letter. My profound sympathies and assurance of all possible help.

On my return here I shall send cheque. Also draft manifesto. Be assured that even if all of us are shot dead, our movement shall NEVER die.

I shall be in Warangal on 2nd Sept.

Sincerely yours,
Sri. Sri.

---

*లెనిన్ శతజయంతి సందర్భం (1970) గా భారత ప్రభుత్వం సింపోజియం ఏర్పాటు చేసింది. శ్రీశ్రీ వెళ్ళలేదు.*

## 88

Madras,

డియర్ నిఖిల్, 29-9-70

మీ 23వ తేదీ ఉత్తరం అందింది. నిన్న రమణారెడ్డిగారు అంతోలాజీ అచ్చుకిచ్చారు. ప్రూఫులూ అవీ నేనే చూస్తాను. శనివారం నాటికి పుస్తకాలు తయారవుతాయి. కొన్ని నాతో ఖమ్మం తెస్తాను.

అంకితం విషయం - అంతోలాజిలో పాణిగ్రాహి పోయం కూడావుంది. అంచేత "భగత్సింగు మొదలు నేటిదాకా ఆహుతి అయిన విప్లవ వీరులందరికీ అంకితం" అనాలనుకుంటున్నాను. బహుశా నేను 6వ తేదీకి ఖమ్మంలో ఉంటాను సరోజ మీ నల్లుల్ని (యువలో వచ్చిన కథానిక) చాలా లైక్‌చేసింది. నేను కూడా

నిన్న నేనూ రమణారెడ్డిగారూ కొ కు గారితో చాలాసేపు మాట్లాడేము. కారాలు మిరియాలు నూరడం కాక కార్యశూరత ప్రదర్శించాలన్నది మా సంభాషణల కాన్‌సెప్షన్.

కాకరాల 25రూ. విరాళంగా ఇచ్చాడు. ఇంకా ఇక్కడ చాలా పోగుచెయ్యాలి. వ్యవధి తక్కువ ప్రెజర్ ఎక్కువ.

మోర్ ఇన్ పర్సన్

యువర్స్ సిన్సియర్లీ

శ్రీశ్రీ

---

విరసం మొదటి కవితా సంకలనం - ఝంఝు

---

## 89

Madras

My Dear Nick, 1-12-70

ఇవాళ ఉదయం క్రాంతి ప్రెస్‌కు వెళ్ళేను. 'ఝంఝు' అచ్చుపని రెండు మూడు రోజుల్లో ప్రారంభిస్తామన్నారు. (హనుమంతరావు మళ్ళీ sick. ఆయన కొడుకుతో మాట్లాడేను.)

మొత్తం 1000 కాపీలకి 400 రూ. అవుతుంది. "విరసం" బాపతు 200 రు॥. ఇంకా నా దగ్గర ఉంది. (ఇతరత్రా బిజీగా ఉండడం. ఇంతవరకు విరాళాలే collect చెయ్యడం లేదు) ఆ రెండు వందలు నేను ఎడ్వాన్సుగా ఇచ్చేస్తాను. మిగిలింది మీరు పంపించండి. (నాకో, లేక క్రాంతి ప్రెస్‌కో)

ఇక్కడ నేను కొంచెం బిజీగానే ఉన్నాను సినీ సెంటలో. అంచేత, విరసం పన్లు కొంచెం వెనుకపడుతున్నాయి. అయినా డిసెంబర్ 15కి ఝంఝు సెకండ్ ఎడిషన్ బైటికివచ్చి చేర్తుంది.

| విరసంలో 40 ఏళ్ళు దాటిన పంది కొక్కులకి ప్రవేశంలేదని నిషేధిస్తే బాగుంటుందని ఉద్దేశం. |
|---|

నాలాంటి ముసలివాళ్ళకి గౌరవ సభ్యత్వం పారెయ్యండి.

Yours,

Sri Sri

---

(ఈ వాక్యానికి ప్రత్యేకించి నలువైపులా చతురస్రంలా గీతలుగీసారు శ్రీశ్రీ)

---

## 90

Madras,

My Dear Nikhil, 5-12-70

మీ ఉత్తరము, ప్రెస్ మేటరు అందాయి. నేనేమీ బలహీనతవల్ల వెనుకంజ వేయలేదు. నిజానికి, ఇవాళ నాకు వెయ్యేనుగుల బలం ఉంది. కాని, యువతరానికి నాయకత్వం అప్పగిస్తే

బాగుంటుందని నా ఆలోచన. మన ఉద్యమం ప్రపంచ పర్యాప్తమైనది. నేను బతికున్నంత కాలమూ నా కలంతో పోరాడుతూనే ఉంటాను

ఇవాళ టైం మాగజైన్‌లో పికాసో (వయస్సు 90) స్టేట్‌మెంట్ చూశాను

"Everyone is the age he
has decided on, and
I have decided to
remain 30 years old".

రమణారెడ్డిగారి పత్రిక అందింది. చాలాభాగం దాశరథిమీద ఎటాక్. నాకు నచ్చలేదు గాని యదాతథంగా అచ్చుకిచ్చేస్తాను. 15వ తేదీ లోపుగా అన్ని కాపీలూ, రైల్వే పార్సెల్‌ద్వారా మీపేరిటనే పంపించే ఏర్పాట్లు చేస్తాను. బహుశా మీరు 200 రూ॥ పంపించే అవసరం లేకుండా మేనేజ్ చేస్తాను డోంట్ వర్రీ.

కథల సంపుటి విషయంలో కూడా మనం ఇప్పటినించీ జల్లుకోవాలి. రా.వి. శాస్త్రికి ఉత్తరం రాయండి. అన్ని కథలూ కొ.కు. గారికి చేరాలి.

Yours in life and death
Sri Sri

# 91

Madras
9-12-70

రావిశాస్త్రికి

Dear R.V.S.

It is a pleasure to hear from you, and an intoxication to learn that our good old folk singer Barkan is being felicitated. Please convey the following greetings to the Board of the bleeding masses.

బారకన్నూ, నా ఆబాల్య మిత్రమా!

నీకు సన్మానం జరుగుతోందని విని చాలా సంతోషించాను. అన్ని సన్మానాలకన్నా నీ ఆరోగ్యం అతి ముఖ్యం. పీడిత ప్రజల ఆవేదనల్నీ, ఆశల్నీ పాడటానికి గాను నువ్వింకా నాలుగు కాలాల పాటు నింపాదిగా వుండాలి.

ఉండి తీరాలి!

ఇట్లు
ఎరుపు మెరుపుల్తో
శ్రీశ్రీ

*బార్కాన్ దాసు (1906 95) - విశాఖపట్టణం వాస్తవ్యుడు. భజన పాటలు బాగా పాడేవాడు. శ్రీశ్రీకి చిన్ననాటి స్నేహితుడు. కవాలిపితామహ అనే వారు. అతనికి విశాఖపట్టణంలో జరిగిన సన్మానానికి శ్రీశ్రీ పంపిన శుభాకాంక్షలు*

# 92

Madras

నిఖిలేశ్వర్‌కి 14-12-70

Dear friend,

"ఝంఝ" ముద్రణ పూర్తి కావస్తోంది. మొత్తం కాపీలన్నీ Rly. parcel లో మీ అడ్రెస్‌కు పంపించే ఏర్పాటు చేస్తాను. సాయంత్రం క్రాంతి ప్రెస్‌కు వెళుతున్నాను. Balance ఎంత చెల్లించాలో కనుక్కుని రేపు మీకు wire చేస్తాను.

బహుశా 24th ని నెల్లూరులో ఉండడానికి ప్రయత్నిస్తాను. Deccan Chronicle రిపోర్టు చూశాను. మన అందరికీ నక్సలైటు ముద్ర వేశారు. శుభం. సాహిత్య అకాడమీ బిరుదులకంటె ఇదే ఎన్నోరెట్లు నయం!

శ్రీమాన్ జలగం వెంగళరావుగారు తెలుగుదేశంలోని నక్సలైటు కవులను ఒక కంట కనిపెడుతున్నట్టు ఎక్కడో చేసిన ఉపన్యాసాన్ని ఏదో దినపత్రిక ప్రకటించుకుందట! మరీ శుభం!! ఈ వెంగళప్పలందరూ ఇవాళ ఉంటారు. రేపు పోతారు. మనం రేపే పోయినా ఆంధ్రభాష బతికున్నంతకాలం సజీవంగా ఉంటాం!

కథల సంపుటి కూడా తొందరగా బయటపడేస్తే బాగుంటుంది.

Sincerely Yrs,

Sri Sri

# 93

Madras,

Dear Nick, 21-12-70

Copies of Jhanjha are despatched to your address. We still owe a little more than 300 Rs. to the press. Kindly send me Rs. 350/-

I have 50 copies of ఝంఝ with me. I'll see that some of them are reviewed in the Madras papers.

We are not afraid of criticism. Let them say whatever they want to say. We have a reply to a strong one at that.

I learn that SRJANA is in trouble. Kindly write to me about it. I am addressing a seperate letter to వరవరరావు

Sincerely yours,

శ్రీ శ్రీ

పేస్ట్ చెయ్యకుండా పోస్ట్ చేస్తున్నాను - శ్రీశ్రీ

## 94

Madras,

Dear Nikhileshwar, 4-1-71

I had to deposit the Draft in my bank. (because it is crossed) Either to-day or to-morrow I shall draw cash to pay Mr. Dhanikonda.

ఎన్ని పనులున్నా 13, 14 తేదీల్లో బెజవాడలో వుంటాను.

భైరవయ్య అరిలోక భీకరంగా అగుపిస్తున్నాడు. అవి నా చెవులకు అమృత ప్రాయంగా ఉన్నాయి.

నా స్టేట్‌మెంట్ ఆరు పత్రికలకు పంపించాను. ఒక్క వెధవముండా వెయ్యలేదు. జానేదో.

Text రమణారెడ్డి దగ్గర ఉంటుంది. నాదెక్కడో పారేశాను.

Sincerely yours,

శ్రీ శ్రీ

## 95

Dear Prasad, Madras, 18-1-71

Hope you have reached Vizag and Sent the amount to Mrs. S.V. Ramanamma (జూనియర్ శ్రీశ్రీ) (One Thousand rupees)

Saroja and myself came here yesterday by Link Express.

Just now we have been to Housing Board. She blurted out that there are tenants. (Which means extra payment, probably with retrospective effect.) So I request you to send immediately a cheque for Rs. 5500=00 drawing in favour of CHAIRMAN, Tamil Nadu Housing Board. You cross it of send by registered post to chairman, T.N. Housing Board, Mount Road, Madras.

Kindly give this matter the foremost priority.

If possible, give me wire.

Sri Sri, 73733, Madras.

ABK has given me "VIVA CHE" which is so inspiring. I want to translate the whole thing.

Eagerly awaiting your reply.

yours Sincerely

శ్రీ శ్రీ

---

VIVA CHE :-

*VIVA అంటే లాంగ్‌లివ్ అని అర్థం - (ఫ్రెంచి, స్పానిష్ భాషలలో.*

*CHE అంటే చేగువేరా (14-6-1928, 8-10-1967) "నేను అర్జెంటీనాలో పుట్టా. క్యూబాలో పోరాడా. గ్వాటిమాలాలో విప్లవకారుడనయ్యా" నని తానే చెప్పుకున్నాడు.*

*VIVA CHE* అనే ఇంగ్లీషు పుస్తకం 1968లో వెలువడింది దేశదేశాల్లోని కవులు, కళాకారుల రచయితలు, మేధావులు చేగువేరా గురించి రాసిన వాటి సంకలనం

ఈ పుస్తకంలోనించి శ్రీశ్రీ చేసిన కొన్ని కవితానువాదాలు మరో ప్రస్థానం సంపుటిలో చోట చేసుకున్నాయి

## 96

Madras,

My Dear Nick,

20-3-71

Is it true the Warangal meet is postponed indefinitely. Kindly wire to me. My telephone number is 73733.

I am gathering signatures for the 'MARCH' protest. Fascist acts like banning literary works should not be allowed to go unchallenged. Indira Gandhi swear by the constitution but her followers deny us our constitutional right of Freedom of speech.

A note about myself. I am no slave to drink. This I shall prove, by totally giving up drink as soon as the Madras Govt., lifts prohibition.

Also no smoking thereafter.

Sincerely yours,
Sri Sri

## 97

మద్రాస్,

కె.వి.రమణారెడ్డికి

23-3-71

Dear KV,

We are already victors. The world is at our feet, got signatures of అనిసెట్టి దేవులపల్లి, ఆరుద్ర, P.V. రాజమన్నార్ etc., Am meeting కరుణానిధి and నెడుంజెళియన్. want to make this[1] an All India Issue. దాశరథి & సినారె are worms.

yours,
Sri Sri

[1] 'మార్చ్' కవితా సంకలనాన్ని ప్రభుత్వం నిషేధించింది.

## 98

మద్రాస

Dear Nick,

1-4-7

ఉత్తరాలు అందేయి. కరపత్రాలు (తణిఖీ పిదప బహుశా) అందుతాయి. MARCH నిషేధ మీద నిరసనకి వందకి పైగా సంతకాలు పెట్టించాను - రాజమన్నారు, కృష్ణశాస్త్రి etc. 'ఝుంఝ మీద కరుణానిధిని కదుపుతాను. నెడుంజెళియన్‌కి ఉత్తరం రాశాను.

డబ్బు సేకరణ కొంచెం ఇబ్బందే. ఇక్కడ సినీమాలవాళ్ళు నన్ను చూసి జడుసుకుంటున్నారు. అయినా, ధనవంతులంత పిరికిపందలీ ధాత్రిలో లేరని నీకు మాత్రం తెలియదా? Sir Galahad చేత Tennyson చెప్పించినట్లు

My strength is as the
Strength of ten
Because my heart
is pure

నా హృదయం పరిశుభ్రమే కాక
పవిత్ర లక్ష్యపరిపూరితం కూడా -

ఓ చిన్న ప్రాసక్రీడ :

ఆలోచన మీద నిఘా
వేస్తున్న లఫంగులు
పోలీసుల కొత్తపేరు
పుస్తకాల దొంగలు

ఇలాంటివి చాలా రాశాను!

yours
Sri Sri

# 99

Madras.
5-4-71

My Dear Nikhileswar,

Received your letter & also enclosed reply from com.........Also the pamphlet.

On 10th inst. ISCUS at Guntur is arranging a meeting where I am to speak on. I wrote a reply accepting their invitation. On 11th is the civil liberties meet.

So I may not be attending the కవి సమ్మేళనం at Warangal.

Signature Campaign is a signal success & I am sending the document per registered post to the Secy. Home Dept., Government of Andhra (On the document is included the finger print of my grandson, Sub junior Sri Sri)

This fellow is insisting on accompanying me to Guntur. So I have to take his grandmother also along with me.

Anyhow, I shall try to start here on the 8th, reach Warangal the same night & from there manage the journey to Guntur.

This is only tentative. I shall telegraphically confirm the same to Vara Vara Rao.

With victorious greetings -

Revolutionarily yours,
Sri Sri

# 100

Madras,

నిఖిలేశ్వర్‌కి 17-4-71

Dear Comrade,

మీ ordinary and express లెటర్సు రెండూ ఇప్పుడే అందాయి. ప్రసాద్‌కి మీ ఉత్తరం ఫోన్‌లో చదివి వినిపించాను. మేం ఇద్దరం definite గా 25వ తేదీ ఉదయానికి కర్నూలులో ఉంటాం. గుంటూరు కామ్రేడ్ సందేహానికి ఒకే చిన్న సమాధానం. వ్యక్తిపూజని వీరపూజతో ఈక్వేట్ చెయ్యకూడదని. అయినా మనం ఎవ్వరం పొలిటీషియన్లం కాము. అలాగని రాజకీయాలకు అతీతులమూ కాము. ప్రధానంగా మనది సాహిత్యపరమైన అవగాహన.

ఈసారి భైరవయ్యని కూడా కర్నూల్‌కి తీసుకొస్తే బాగుంటుంది.

ప్రజలు - అనగా పీడిత ప్రజల భాషలో ఈనాడు అన్ని రకాల సాహిత్య సృష్టి జరగాలి. ఇదే విప్లవ రచయితల విశిష్ట కర్తవ్యం.

yours Sincerely,

Sri Sri

# 101

Madras,

Dear Nikhil, 21-4-71

ప్రొద్దుటూరునించి నిన్న డా॥ M.V. రమణారెడ్డిగారు వచ్చారు. 23వ తేదీకి టిక్కెట్ బుక్ చేశాను. ఆ రాత్రి కడపలో ఆగి, తెల్లారుజామున కర్నూలుకు బయల్దేరుతాను. ఇక్కణ్ణుంచి నేనొక్కణ్ణే వస్తున్నాను. సినిమా పని తొందరలు లేకపోలేదు.

Even so, Cinema can wait.

yours Sincerely,

Sri Sri

# 102

Madras,

Dear Nikhil, 24-6-71

చిలకలూరిపేట, ఇంకొల్లు, మంగళగిరి, బాపట్ల సభల్లో పాల్గొని ఉదయమే తిరిగి వచ్చాను. మీ regd. letter ఎదురు చూస్తోంది. కొ.కు. గారికి ఫోన్ చేశాను. అస్వస్థత కారణంగా రాలేకపోతున్నానని అప్పుడే మీకు రాశారట. నా రాక కూడా సందేహాస్పదమే. కారణం ఆర్థికం (కాని, ఇవాళా, రేపూ, ఎల్లుండి కూడా ప్రయత్నించి ఎలాగైనా 27కి హైద్రాబాదుకి రావాలని వుంది. వస్తే టెలిగ్రాం ఇస్తాను.)

జూలై మొదటి వారానికిది post pone చేస్తే బాగుంటుందని నా ఉద్దేశం. అప్పుడయితే కుటుంబరావుగారిని కూడా కదల్చగలనని ధైర్యం. విజయవాడ అయితే ఇంకా బాగుంటుంది.

పౌర హక్కుల సభలు దిగ్విజయంగా జరిగేయి.

కథాసంపుటి ముద్రణ ప్రయత్నాలు సాగుతున్నాయి.

ప్లీజ్, వెంటనే జవాబు రాయండి

Sincerely yours
Sri Sri

# 103

Madras,
12-7-71

మంగెన గంగాధర రావుకి

My dear friend,

ఉత్తరం అందింది. ఎవరి ఉత్తరాలకూ జవాబు వ్రాయనని నా మీద ఒక వాదు ఉంది. అది కొంతవరకు నిజమే! నాకు రోజూ మీవంటి అభిమానుల వద్దనుంచి ఉత్తరాలు వస్తూ ఉంటాయి. అందరికీ ఒకటే జవాబు! Thank you అని,

Sincerely yours ,
Sri Sri

# 104

Madras,
28-7-71

My Nikhileshwar,

మీ రెండు ఉత్తరాలు అందేయి. రెండు నెలుగా ఏ professional work కూడా లేకుండా ఇబ్బందిపడుతుండగా ఇప్పుడు ఒకేసారి 2 పిక్చర్లకు పనిచెయ్యవలసి వచ్చింది. ఎలాగైనా 8,9 తేదీల్లో అక్కడ ఉండడానికి ప్రయత్నిస్తాను. బహుశా సరోజ కూడా నాతో రావచ్చు.

Sincerely yours ,
Sri Sri

# 105

Madras,
20-10-71

నిఖిలేశ్వర్‌కి

My Nikhi,

మిత్రుడు R V.S. సుందరం (అధ్యాపకుడు, M.F.B. కాలేజీ, చింతామణి, కోలారు జిల్లా, మైసూర్ state) లోగడ విప్లవకవులకు రెండుత్తరాలు రాశారట. (కన్నడంలోని మీ రచనలు అనువదించడానికి అనుమతి కోరుతూ). రెండుత్తరాలకీ జవాబు లేదు. అవి మీకు అందనే లేదేమో అని అనుమానం. పై చిరునామాకి మీ ఉత్తరం సమ్మతి పంపిస్తే సంతోషిస్తాను. దానితోబాటు హైకోర్టు తీర్పు కాపీ, కూడా (ఇంగ్లీషుది) పంపించండి.

నవంబరు 7న నెల్లూరులో పౌరహక్కుల సభకి వెళ్తున్నాను. మీకేమైనా ఆహ్వానాలు వచ్చాయా?

Sincerely yours ,
Sri Sri

## 106

Madras,
ద్వారం బలభద్రరావుకి
4-7-72

Dear brother,

Shocked beyond words, be BRAVE. My heart felt condolences to you & yours.

Sincerely yours ,
Sri Sri

నా పంచప్రాణాల్లో ఒకటి ఎగిరిపోయింది. ఇంతకన్న ఏం వ్రాయను?

S. S.

*శ్రీశ్రీ మిత్రుడు ద్వారం జగన్నాథరావు 1-7-72న మరణించారు.*

## 107

ఆంధ్రజ్యోతి వారపత్రిక
సంపాదక మహాశయులకు :

ఇందులో నేను పంపిన నెరూడా అనువాదాల్ని రెండింటినీ ఒకే సంచికలో (మీ అంగీకారం పొందిన మీదట) ప్రచురించగోరుతాను. (రెండింటినీ ఒకే కవి వ్రాసినా, వాటి స్వరూప స్వభావాలలో ఉన్న తేడాను తెలివైన పాఠకులు సులువుగానే గ్రహించగలరనుకుంటాను. మొదటిది, మరణం మీద, యువక సక్రియలిస్టు రాశాడు. రెండోది, తన మేజోళ్ళమీద, వృద్ధ కమ్యూనిస్టు రాశాడు. మొదటి గీతంలో కమ్మెచ్చున లాగినట్టున్న దీర్ఘపాదం, రెండో దానిలో మూడు నాలుగు మాటలకు మించని హ్రస్వపాదం ఈ రెండూ నెరూడా ప్రత్యేకతలే. ఇక నాటికీ, నేటికీ అతని భావాలలో వచ్చిన పరిణతిని చూపించడానికి రెండే ఒకే సంచికలో వెయ్యండని కోరుతున్నాను)

(వెయ్యకపోతే తిప్పి పంపెయ్యండి. వేస్తారనే నమ్మకంవల్ల పోస్టేజీ స్టాంపులు జత పరచలేదు. నా అలవాటు చొప్పున నకళ్లు తీసుకోకుండా రాసినవి రాసినట్లు పంపుతున్నాను.)

అన్నట్టు, సి.నా.రె. గారి సమాధానమూ, మీ క్షమాపణా నాకు ముచ్చట గొలుపకపోలేదు. నేను ఉత్తరం రాసిందాకా అయినా, సి.నా.రె. తానే అసలు రచయితగా పాఠకులను భ్రమపెట్టడం జరిగిందని గుర్తిస్తూ మీ గుర్తుకు తెస్తున్నాను. అనగా, కనీసం కొన్ని రోజుల బాటైనా ఆయన మీ పొరపాటును తన సొంతానికి వాడుకున్నట్లు నేను భావించడం నా పొరపాటు కాదనుకుంటాను.

మద్రాసు
6-11-72

శ్రీశ్రీ

# 108

Madras,
8-1-73

My Nikhileshwar,

రావడానికి గట్టిగా ప్రయత్నిస్తాను. కాని, ఈ మధ్య మా ఆవిడకు heart stroke వచ్చి ఇంకా కోలుకోలేదు. ప్రస్తుతం ఆసుపత్రిలోనే ఉంది. మళ్లీ stroke రాకుండా డాక్టర్లు జాగ్రత్త తీసుకుంటున్నారు.

ఇక్కడ నా పరిస్థితి చాలా గందరగోళంగా ఉంది. అయినా తప్పకుండా రావాలనే ఉంది. రాగలుగుతాననే ఆశిస్తున్నాను.

Sincerely yours ,
Sri Sri

# 109

Madras,
8-1-1973

My dear Nikhileshwar,

బహుమతి సంగతి మొదటిసారి వినగానే 'To hell with the award' అనుకున్నాను కాని, నన్ను కొన్ని నెలల నుంచీ పీడిస్తున్న మార్వాడీ, కాబూలీ అప్పులు నన్ను నరకం నుంచి భూమార్గం పట్టించాయి. తిలక్ (కొల్లిపర నరసింహారావు సోదరుడు), కుటుంబరావు, ఆరుద్ర మొదలగువారు నిరాకరించవద్దని సలహా ఇచ్చారు. విజయవాడ నుంచి పురాణం 'సినిమావారికంటే అకాడమీవారు ఎక్కువ నీచులు కారు కదా' అని రాశారు. మీతో Phone లో నేను చెప్పినట్లు అకాడమీలో మన స్థలాలను demand చెయ్యవలసి వుంటుంది. చాలా fossiles ను తొలగించ వలసి వుంటుంది.

ప్రస్తుతం నేను మద్రాసులో వుండక తప్పదు. (ఈ విషయం టెలిగ్రాం ఇచ్చాను) I am in dire financial straits. పెద్దావిడ ఆరోగ్యం ఇప్పుడు బాగానేవుంది గాని, నెల్లాళ్ళదాకా మంచం దిగకూడదు. My Expenses are mounting and income is almost Nil - ఇదొక్కటే బహుమతిని అంగీకరించడానికి కారణం - విరసం మిత్రులు నన్ను అపార్థం చేసుకోరని ఆశిస్తున్నాను?

మన సాహిత్యంలో చెయ్యవలసిన పనులు చాలా ఉన్నాయి. విరసం సొంత ప్రెస్ అన్నింటికన్నా ముఖ్యం. ఒక fund raising Campaign ఇందుకు ప్రారంభించాలి.

కార్యవర్గ సమావేశం విశేషాలు తెలియజెయ్యండి.

Martyrs సభ జేగియ మానంగా జరగాలని ఆకాంక్షిస్తున్నాను.

Sincerely yours ,
Sri Sri

---

P.S. : విశాలాంధ్ర విభజన ఆత్మహత్యా సదృశమని నా నిశ్చితాభిప్రాయం. దీని వెనుక ఏయే వర్గాలు పనిచేస్తున్నాయో నేను వేరే చెప్పక్కర్లేదు.

# 110

Madras, 12-1-1973

My dear Nikhileshwar,

ఇప్పుడే మీ ఉత్తరం అందింది. రమణారెడ్డి, సాంబశివరావు గార్లు రెండు రోజులనుంచీ ఇక్కడే ఉన్నారు. At this moment they are having a talk with Mr. Tilak. ఒకటి మాత్రం నిశ్చయం : అయిదువేల రూపాయల కోసం వి.ర.సం. అధ్యక్షతకు రాజీనామా ఇచ్చి ఉద్యమానికి ద్రోహం చెయ్యను. "శత్రువు దగ్గరనుంచి మనం ఆయుధాలు లాక్కోవడం లేదా" అన్నది తిలక్ గారి వాదం. కాని అడవుల్లో, కొండల్లో ప్రాణాలనే పణంపెట్టి మహాబలోపేతమైన రక్కసి ప్రభుత్వంతో పోరాడుతున్న వాళ్లు, జైళ్లలో మ్రగ్గుతున్న విప్లవకారులు నాకు వ్రాయని ఉత్తరాలకే ఎక్కువ విలువ ఇస్తాను.

నిన్న సాయంత్రం ఇక్కడ ఒక సన్మానసభ జరిగింది. (కృష్ణశాస్త్రిగారి అధ్యక్ష ప్రసంగాన్ని పాలగుమ్మి పద్మరాజుగారు చదివేరు.) విద్వాన్ విశ్వం, ఆరుద్ర, చల్లా రాధాకృష్ణమూర్తి గార్లు మాట్లాడేరు. నేను జవాబిస్తూ బహుమతి తీసుకునేదీ, లేనిదీ ఇంకా నిర్ణయించలేదనీ, ఇంతకూ 17 ఫిబ్రవరి (బహుమతి ఇచ్చే రోజు) దాకా టైం ఉందనీ అన్నాను. ఈలోగా మరికొన్ని సభలు జరగవచ్చును. ఎక్కడైనా ఇదే మాట.

"వి.ర.సం." తరపున కొంత డబ్బు సేకరించి ఇస్తామని రమణారెడ్డి గారన్నారు. ఇది, సుతరామూ నాకిష్టంలేదు. వి.ర.సం. కార్యవర్గం ఒక తీర్మానం చేసి అనుమతిస్తే బహుమతి తీసుకుంటాను. ఇప్పుడున్న అకాడమీలు త్వరలోనే రద్దవుతాయి. కొత్త వాటిలో మనం సముచిత స్థానాల కోసం పోరాడాలి.

As I see it, there is no point in reforming the over end. ప్రపంచం మొత్తం మీద దరిద్రంలో మొదటి స్థానం అలంకరిస్తున్న భారతదేశంలో 5 వేలు తక్కువ డబ్బు కాదు. With the approval of విరసం, I am prepared to donate the entire amount to our association.

అందరూ ఆలోచించండి. వి.ర.సం. తీర్మానాలన్నింటికీ కట్టుబడి ఉంటానని వేరే చెప్పనక్కర లేదు.

Sincerely yours ,
Sri Sri

*(ఈ ఉత్తరం ఇప్పుడే రమణారెడ్డి గారికి ఫోనులో చదివి వినిపించాను. డబ్బు పోగు చేయడం విరసం తరపున కాదన్నారు. మరో విషయం కూడా స్పష్టం చెయ్యమన్నారు.* ***If it is a choice between the people and the akademy, Sri Sri with always be will the people*** *అని*

*Yours Sri Sri*

# 111

Madras,
20-1-73

Dear నిఖిలేశ్వర్,

"వి.ర.సం" రాష్ట్ర విభజన కోరుతున్నందుకు అసమ్మతి తెలుపుతూ నా అధ్యక్షతకు రాజీనామా ఇస్తున్నాను. వరంగల్లులో జరగబోయే ప్రత్యేక రాష్ట్ర సదస్సును నేను సమర్థించలేను.

Sincerely yours ,
Sri Sri

# 112

Madras,
23-1-73

Dear Ramana Reddi garu,

By now you might have known that I resigned my Presidentship.

వి.ర.సం. తీర్మానం, కొ.కు.గారితో statementనేను సరిగా చదవలేదు. తీరా చూస్తే వి.ర.సం. కూడా విభజనకు అనుకూలమని స్పష్టమయింది.

విభజనోద్యమం నా ఉద్యమం కానేరదు. ఎన్ని చెప్పినా ఇది భూస్వాముల, మిల్లర్ల, బస్సు ఓనర్ల ఉద్యమం, దీన్ని సమర్థించే ఊరేగింపుల్లో పాల్గొనలేను.

My wife's health continues to be indifferent. She is again in hospital.

Unity is a fire that can never stink.

వి.ర.సం. నుంచి బైటికి వచ్చిన నేను ఇంకే సాహిత్య సంస్థలోనూ చేరబోను. P.E.N. ఒక క్లబ్బు మాత్రమే.

To-day I am free to indulge in my twin pet notions of Anarchism and Atheism.

Sincerely yours ,
Sri Sri

# 113

Madras,
25-1-73

Dear రమణారెడ్డిగారూ,

రాజకీయ వాదులు తప్పులు చేయనూగలరు. దిద్దుకోనూగలరు. రచయితలు తప్పులు చేస్తే, తప్పులురాస్తే అవి చరిత్ర పుటల్లో శాశ్వతంగా అచ్చు గుద్దుకుపోతాయి. అయిదువేల రూపాయల కోసం నేను సమైక్యవాదాన్ని చేపట్టానని మీరైనా అంటారనుకోను. Unity of all the Telugu people is an article of faith with me. రేప్పొద్దుట ఇందిరాగాంధీ లొంగి వచ్చి విభజన ఒక fait accompli అయితే నేను తెలుగుగడ్డపై కాలుపెట్టను. అంతే! There is no going back on this stand.

Sincerely yours ,
Sri Sri

# 114

Madras,
31-1-73

Dear Nikhi

వి.ర.సం. అధ్యక్షత రాజీనామా ఉపసంహరించుకుంటున్నాను. As its Secretary, you can give the widest publicity to this news.

But, విభజనకు నేను బద్ధ విరోధిని. విభజన జరిగితే తెలుగువారు ఏకమయ్యేదాకా తెలుగు గడ్డమీదే కాలుపెట్టను. (ఆనాడు పర్లాకిమిడి వదలిన గిడుగువారి లాగ)

శత్రువునుంచి 5000 రు. గుంజుకోవాలని నిశ్చయించాను. ఇందుకు నా ఆత్మీయులంతా అంగీకరించగలరని ఆశిస్తున్నాను.

General body మీటింగు తప్పకుండా పెట్టండి. సమైక్యం కోసం హోరాహోరీ పోరాడుతాను. ఇక్కడ రాజీకి చోటులేదు.

Sincerely yours ,
Sri Sri

# 115

Madras,
1-2-73

**చలసాని ప్రసాద్‌కు**

Dear Prasad,

This is to acknowledge receipt of a draft for Rs. 720/- from Sri Joshi of Visalandhra Publishing House.

My wife is being discharged from the medical centre tomorrow.

Hope you have received my previous letter in which I have intimated you that I have withdrawn my resignation.

Sincerely yours ,
Sri Sri

# 116

Nagpur,
17-2-73

Dear Prasad,

I have just now arrived from Delhi & am writing this letter. Yesterday I gave you a wire to tel.no. 72784. I hope the number is correct.

I had a lot of trouble getting Hotel accomadation & the first thing, I got into touch with Sahitya Akademi Cronies. There had been a lot of heated discussion. They had been a lot of heated discussion. They refused to allow me make a statement. I wrote to the Secretary then & there that I am not attending the function (By that time the Secretary had not arrived) for my own reasons. They still think that I may afterall accept the award. Let them tie themselves in to knots. I have not attended the function and you know the decision about the award which is irrevocable.

On arrival at Madras, I shall have many important affairs demanding my attention. The money I brought with me is almost spent. Hotel Janpath wanted

160 Rs from 5a m. to 12 noon and another 160 Rs. if I stay for the night. I took a single room in a/c class hotel paying 60+60 Rs. I was eager to leave Delhi as soon possible. Luckily I got accommodation in Southern Express. So I am here More in person. For the Present I am rid of the amount botheration. If & when I hear from the Akademic Secretary, I will give a sensible reply. I am sorry I could not write to వరవరరావు . All the time was swallowed in ticket-hunting.

Sincerely yours ,

Sri Sri

# 117

Madras, 8-3-73

My dear Nikhil,

చాలా ఆలస్యం చేసి, ఈ ఉత్తరం రాస్తున్నాను. కారణం, ఇన్నాళ్లూ నాలో నేను తీవ్రంగా ఆలోచిస్తూ ఏ నిర్ణయానికీ రాలేక, ఏమీ రాయలేకపోయాను. ఇప్పటొక కచ్చితమైన నిర్ణయానికి వచ్చాను. అదేమంటే, academy award స్వీకరించాలని! అయితే నాకోసం కాదు ఆ మొత్తం వి.ర.సం. ప్రెస్సు నిధికి గాను. ఆ నిధికి ఇదో ప్రారంభం మాత్రమే.

వారం రోజులనుంచీ చెక్కు నా దగ్గరే ఉంది. దాని వెనుక Pay the amount to Secretary, వి.ర.సం. అని వ్రాసి సంతకం చేసి రిజిస్టర్డ్ పోస్టులో మీకు పంపిస్తాను. దాన్ని వెంటనే బ్యాంకులో పడెయ్యవలసిందిగా చెరబండరాజుకు ఇచ్చెయ్యండి. 5 వేలు నిరాకరించడం కన్న తెలివితక్కువ ఇంకోటి ఉండదు. After all, దీన్ని మనం ఇవ్వవలసిందని అడగలేదు. (సి.నారాయణరెడ్డి ఈ బహుమతి కోసం నానా తంటాలు - బెంగుళూరు వెళ్ళి - పడ్డాడు) ఇది లంచం కాదు. బంగారు వల కాదు. వి.ర.సం. అధ్యక్షుడుగా ఈ మొత్తాన్ని నేను donate చేస్తున్నాను. మీరూ, జ్వాలా, జైరామ్, even చెర ఇందుకు సుముఖులని నాకు తెలుసు. ప్రసాద్, రమణారెడ్డిలాంటి ఉగ్రశైవులు శిరగ్గొట్టమనీ, తిడుతూ ప్రకటన ఇవ్వమనే ఉత్తరాల మీద ఉత్తరాలు రాస్తున్నారు. డబ్బూ, నోరూ రెండూ పారేసుకోవడం తప్ప దీనికింకో ఫలితం ఉండదు. ఇక మన నిబంధనావళి ఒకటి ఉంది. నేటి సెన్సారు నిబంధనలు సరిగా అమలు చేస్తే, ఒక పిక్చరు కూడా తియ్యడం ఎలా అసాధ్యమో మన నిబంధనలూ అలాంటివే. వాటిననుసరిస్తూ, అడవుల్లో బతకాలే తప్ప, నేటి పెట్టుబడిదారీ సమాజంలో బతకలేము. మనం వాస్తవాలను గుర్తిస్తాము. ఆచరణ సాధ్యం కాని ఆదర్శాలను తిరస్కరిస్తాము. ఉదాహరణకు అహింసా ధర్మం.

వి.ర.సం. పుట్టిన మూడేళ్లకు మనదీ అని చెప్పకోదగ్గ Bank balance లభ్యమవుతోంది. నేను త్రికరణ శుద్ధిగా ఈ మొత్తాన్ని విరాళంగా ఇస్తున్నాను. Please accept the same.

ప్రస్తుత పరిస్థితుల్లో ఇదే నాకు తోచిన Best possible solution.

Sincerely yours ,

Sri Sri

Send donation అని మీ టెలిగ్రాం కోసం ఎదురుచూస్తున్నాను.

Yours Sri Sri

చెక్కు ఎలా endorse చెయ్యాలి?

Treasurer RWA అనా, లేక

Secretary, RWA అనా

Yours Sri Sri

# 118

Madras, 16-3-73

Dear నిఖిలేశ్వర్,

నా ఉత్తరం అందలేదేమో అనుకున్నాను. వి.ర.సం. సభ్యులంతా నా నిర్ణయాన్ని ఆమోదిస్తారనీ అనుకుంటున్నాను.

విరసానికొక నీతి, శ్రీశ్రీ కొకనీతి అని కాదు. ఉభయులం నీతి బాహ్యమయిన సమాజంలో జీవిస్తున్నామన్న వాస్తవం గుర్తించాలి. ప్రస్తుతం నేను రెండు పౌరాణిక చిత్రాలను డబ్ చేస్తున్నాను. శ్రమయెక్కువా, లబ్ధి తక్కువా. కొద్ది రోజుల్లో గుంటూరు శేషేంద్రశర్మ పుస్తకం ఆవిష్కరించడానికి హైద్రాబాదు వస్తున్నాను. అన్ని సంగతులూ అప్పుడు మాట్లాడుకుందాం.

చెక్కు అందినట్లు రసీదు పంపించివేశాను. ఆ మొత్తం వి.ర.సం. నిధికి donate చేస్తున్నానని కూడా వ్రాశాను. ఇప్పటికీ ఇదే నా నిర్ణయం.

yours

శ్రీ శ్రీ

# 119

Madras, 16-3-73

శేషేంద్రశర్మకి

Dear creative classicist,

Thanks for your letters and books and the first instalment of verses, Telugu and English.

Are the volumes getting ready? Why not send me the final proofs, instead of piecemeal mailings?

Till the twenty-fifth of this month I'll be busy with my film work. After that any date is OK by me.

Remember me to your Mrs. Hope this letter finds you both in good cheer.

Yours Sincerely,

Sri Sri

P.S. I shall bring "There cheers for Man" when I go over there.

Yours Sri Sri

Extract from a recent film song.

దేవుడు చేసిన మనుషుల్లారా
మనుషులు చేసిన దేవుళ్ళారా
కనండి దేవుడి లీల
వినండి మనుషుల గోల

A bank robbery takes place.

Song continues :

పేదల నెత్తురు తాల్చిన రూపం
బలిసిన జలగలు దాచిన పాపం
మానవులను పీడించే జబ్బు
దేవతలను ఆడించే డబ్బు
తెలుపో నలుపో జానేదేవ్
ఆ - తేడాలిక్కడ లేనే లేవ్ etc.

## 120

Poona , 4-4-73

**మై డియర్ రమణారెడ్డిగారూ,**

ఇవాళ ఉగాది. ఇక్కడ పూనాలో ఉన్నాను. ఇది ఏ దైవజ్ఞులనూ (pre-planned గా) సంప్రదించి చేసింది కాదు.

నా better judgement కి విరుద్ధంగా మీరూ, ప్రసాద్‌గారూ నా చేత నానా పల్టీలూ కొట్టించారు. ఇవాళ నా జడ్జిమెంటే నెగ్గింది.

I have cashed the Akademi cheque. అందులో 3 వేలు కాబూలీకి. 2 వేలు ఇంటి రిజిస్ట్రేషన్‌కి.

ఇంటిమీద 25 వేలు అప్పుతెస్తున్నాను. అందులో 5 వేలు విరసంకిస్తా.

ఇదీ పరిస్థితి.

Both Prasad & ప్రభాకర్‌రెడ్డి let me down. పరిస్థితుల కారణంగా. 2-1-73 నుంచి ఇవాళదాకా జరిగిందంతా నేనైతే కాగితం మీద note చేసుకోలేదుగాని అన్నీ జ్ఞాపకం ఉన్నాయి.

విరసం దరిద్రుల సంస్థ. కాని, దరిద్రసంస్థ కాదు.

గవర్నమెంటునుంచి కొల్లగొట్టిన 5 వేలూ నేను విరసానికి విరాళంగా ఇస్తాను. (మీ పిడివాదం అడ్డురాకుంటే)

కమ్యూనిస్టులు (ఏ రంగు వాళ్లైనా సరే) మన శత్రువులు కారు?

ఇందిరా సైన్యాలు ఆంధ్రసేనను ఊచకోత కోస్తే ఆవిడ మనపని చేసి పెడుతోంది. మీరు జనసంఘీలకు నాటుబాంబులు అందించవద్దు.

ఇంతకూ విరసం సాహిత్య సంస్థ. Political party కాదు

మనవాళ్లు ప్రాణాలనే తృణప్రాయంగా ఒడ్డి అడవుల్లో కొండల్లో పోరాడుతున్నారు. ఆ పని మనం చెయ్యలేం. వాళ్ళకి నా జోహార్లు

అన్ని మతాల్నీ reject చేసిన మనం ఒక కొత్త religious cult స్థాపించడం బాగుంటుందా?

"నూతన నిగళ నిబంధన

చేతస్కులు" అన్నాను. ఇది విరసానికి వర్తించకుండు గాత!

I am an anarchist

I am an athiest.

Sincerely yours ,

Sri Sri

# 121

Madras

10-4-7(

Dear Ramana Reddi garu,

Believe me there is not a trace of anger in my mind against you, Pungent, Yrs, your recent letters have been, the content of which, instead of incensing me, set my mind furiously thinking. As far as Virasam is concerned, I am guilty on two counts. 1) accepting the award and 2) opposing separation. Crimes indeed for which Virasam will be fully justified if it throws me out. But, as an individual, I do not feel guilty on both the counts. I am seriously thinking of resigning my primary membership, even if ony to prove that Virasam can very well exist without Sri Sri. If at all Virasam should take me back in to its fold, it has got firstly to accept my donation of the award amount and secondly to give up the separatist stand.

As I see it, Virasam is the authentic voice of flamming youth. All the old bandicoots over fifty should mercilessly be jettisoned from the organization. If a man is as old as he feels (and a woman. as she looks) then I am quite young at heart. Yet my years weigh heavily on me. That is a physical fact. I have already been the President for three years running. It is time new blood is infused. I can ree off at least a dozen names of Virasam members who are eminently equipped to handle the steering wheel. Anyhow it is not names that count, solid, creative. constructive work has got to be done. I see vast vistas opening before the Revolutionary writers. The future belongs to them. I shall be happy to trudge along with them as a well intentional fellow traveller.

Yours Sincerely,

Sri Sri

# 122

Madras
10-4-73

Dear Seshen,

Glad my poona letter reached you. I was afraid it was lost in transit. I intended it as an introduction (to be used in both the languages). If you could translalate the Telugu portions in to English & viceversa I think the purpose will be served.

There is no reluctance or inhibition on my part to write the foreward. If there was no particular reference to Seshajyotsna, it is quite international. I wanted to be general in my approach. I accept you as that rare being, the authentic poet and as such you are in no need of any certificate of merit from me.

Why don't you give me your telephone number.? All these days it has been from H'bad to Madras. Let me have the pleasure of talking to you over the phone from this end.

It is a great pleasure for me to accept your translation of Charles Bawdelaires poems.

I am bringing along with me, "There cheers for man" But all the poems and those, you can find in the Sri Sri Miscellany.

Hope this letter finds you and Mme. Indira in good cheer.

Sincerely yours ,
Sri Sri

# 123

Madras,
23-4-73

చలసాని ప్రసాద్‌కు

ఇన్నాళ్ళూ మీకు ఏం రాయడానికీ తోచక రాయలేదు.

**Dear Prasad garu,**

ఇవాళే నిఖిల్ నుంచి invitation వచ్చింది.

అందరం తెనాలిలో కలుసుకుందాం. నేను కూడా guilty గా feel అవుతున్నాను. కాని integration విషయంలో మాత్రం కాదు.

Award cheque అందిన 15 రోజుల్దాకా ఆగి, ఆ తర్వాత మార్చి, ఇంటి రెజిస్ట్రేషను కిందా, కాబూలీ కిందా సెలవు చేశాను. వ్రతం చెడ్డా ఫలం దక్కలేదు. ఫండ్ ఆఫీసు నుంచి అప్పు చేతికి రావడానికి ఆరు నెలలు పడుతుందట. ఈ లోగా రెండు మూడు private sources (కొద్దిగా ఎక్కువ వడ్డీతో) try చేస్తున్నాం. వాళ్ళు ఇదిగో అదిగో అంటున్నారు. పరిస్థితులు మళ్ళీ మామూలు మెడలోతుకు వచ్చాయి. Yet I am not daunted.

Yours
శ్రీ శ్రీ

Award amount పూర్తిగా విరసం press నిధికి donate చేస్తున్నానని ప్రభాకరరెడ్డిగారికి చెప్పాను. He said O.K.

# 124

Madras,
18-5-73

Dear Prasad,

By now you might have known the sad news. Mrs. Sri Sri is no more. The third attack (tuesday 11.35p.m.) was fatal. One of the earliest visitors the next morning was Sri Krishna Sastry.

Nearly five decades of togetherness lay shattered that night in less than twenty minutes. Mrs. Ramanamma's exit has left a void in my life. I feel so empty, so lonely.

The empty space above, symbolizes my present state of mind.

Sincerely yours ,
Sri Sri

---

*శ్రీమతి రమణమ్మ 15-5-73న చనిపోయారు.*

---

# 125

Madras,
29-6-73

My Dear Prasad,

If some one told me that the Nagarjuna Sagar is razed to the ground by an unexpected atomic blast, I would merely shrug my shoulders saying. "Is it so? Then let it be so" But not so when SambasivaRao's letter tells me of a calamity too shocking for words. N.S. the dam condemned will be constructed again, but the other NS is lost for ever.

I won't be foolish enough to think that a few words of condolence from me would bring comfort to the grieving heart of N.S.'s young wife or to her suffering parents.

So now, if any when, mum's the word.

Yours sufferingly,
Sri Sri

---

*(విప్లవ కథకుడు, విరసం ప్రకాశరావు యాక్సిడెంట్ సంగతి తెలిసి)*

---

## 126

Madras,
10-7-73

Dear Prasad,

N.S. మరణవార్తకి జవాబు మీకో ఉత్తరం రాశాను. అందిందా? అందితే ఒక కాపీ, (ఇంగ్లీషులోనే) టైపు చేయించి మన 'ప్రజాసమస్యలు' (రాజమండ్రి) పత్రికకు పంపగోరుతాను. ఆ పత్రిక next issue N.S. (నవసమాజ) ప్రకాశరావుకి అంకితం.

Yours Sincerely
Sri Sri

## 127

Madras,
12-12-73

Dear KVR,

Just finished "మరో ప్రస్థానం" the title poem of my next vol. of poetry.
Tomorrow I am going to Hyderabad.
14th H'bad
15th Karimnagar
16th Warangal
17th Madras
This is my programme.
You'll be glad to know that I am writing some additional diologues for Krishna's అల్లూరి సీతారామరాజు.

Yours Sincerely
Sri Sri

Please acknowledge reception of the poem.

*S.S.*

## 128

Madras,
18-12-73

Dear రమణారెడ్డి గారు,

హైద్రాబాద్, వరంగల్, కరీంనగర్ వెళ్లి నిన్ననే వచ్చాను. మీ reminder లెటరూ, rescript లెటరూ అందాయి. గుంటూరు పౌరహక్కుల సభకు వస్తున్నారా. అక్కడినుంచి మళ్ళీ ఉత్తరం లేదు. తేదీ 22 or 23 సరిగా తెలియదు. మీకు తెలిస్తే వ్రాయండి. నా poem లో ఈ దిగువ మార్పులూ చేర్పులు చెయ్యండి.

1. ఓరయ్యో సేద్యగాడ
అయ్యయ్యో బానిసీడ
2. యెన్నాళ్లు చాకిరీ
యెన్నేళ్లు చాకిరీ

బతికున్న వాళ్ళ పేర్లు avoid చెయ్యాలని వరవరరావు సలహా.
I think the above are the same in my original.
Add after.....సం ఘాతంతో కలిసిరండి.

3. బూర్జువాల రాజ్యాంగపు
బూజంతా దులపండి
4. చంద్రపుల్లారెడ్డి, తరిమెల నాగిరెడ్డి
వేసిన పాలికేక, సత్యమూర్తి పెనుధాక

Add after శ్రీశ్రీ ప్రియ శిష్యుడివో

5. చూస్తావేం నిప్పులు
దాస్తావేం నీవిప్పుడు
చెయ్యి మరో ప్రస్థానం

Yours Sincerely,
Sri Sri

# 129

Madras,
28-2-75

మై డియర్ నిఖిల్,

మీ ఉత్తరమూ, కరపత్రమూ కొంచెం ఆలస్యంగా అందేయి. (నేను హైద్రాబాదునుంచి వచ్చాక) నేను కొంచెం ఆలస్యం చేసి ఈ జవాబురాస్తున్నాను. ఇది కొంచెం ఆలస్యంగా మీకు అందవచ్చు. ఇదీ ఈనాటి ఆబ్జెక్టివ్ రియాలిటీ.

మనం శత్రువుల మధ్య నివసిస్తున్నాము. అరణ్య నాగరికతలో జీవిస్తున్నాము. రెండుకాళ్ళ మీద నడుస్తూ, ఏదో ఒక భాష మాట్లాడుతూ మానవులుగా చలామణి అవుతున్నాము. ఎన్నో భయాలతో, ఆశలతో, ఉద్రేకాలతో, ఊహలతో ఈ ప్రపంచాన్ని అర్థం చేసుకుందామని, ఏదో రాద్దామని ఉవ్విళ్ళూరుతున్నాము. మనల్ని రచయితలుగా మన శత్రువులు కూడా గుర్తించారు. ఇదో చిన్న విజయంగా మనం గర్వించవచ్చు.

కాని మనకు తెలుసు. ఇది ఎడతెగని పోరాటమని సుదీర్ఘ కాలం సాగేదని! అంతేకాదు, అంతిమ విజయం కూడా మనదే అని. ఈ సమరంలో పురోగమనంతోబాటు హృదయ విదారకమైన తిరోగమనాలుకూడా తప్పవు. స్ట్రేటజిక్ రీట్రీట్ అనేది యుద్ధ తంత్రంలో ఒక ముఖ్యాంశమే. అంటే దీని అర్థం మీరు తిరోగమించారనీ, నేను (పోనీ విరసం) పురోగమనిస్తున్నాననీ కాదు. అయిదేళ్ళ విరసం చరిత్ర మీకు చెప్పడం తల్లి పుట్టినిల్లు మేనమామ దగ్గర వర్ణించడం లాంటిదే.

విరసం, ఒక వ్యక్తిని - దాపరికం ఎందుకు - చారు మజుందారును ఆరాధిస్తోందనే మీ ఆరోపణ కేవలమూ భ్రమాజనితమని నేను చెప్పక తప్పదు. ఈ పొరపాటు అవగాహనను పునాదిగా చేసుకోవడం వల్లనే మీరు గాడి తప్పిపోతున్నారు.

నిజమే అనంతపురం నిండా చారుబాబు బొమ్మలే, నినాదాలే కాని, మీరు నన్ను కాని కొ.కు ని గాని, రావి శాస్త్రిని గాని, కా.రా. నిగాని చారు భజనపరుల కింద జమకట్టగలరా? కార్యవర్గంలో కొంతమంది అగ్నిహోత్రావధాన్లుండవచ్చుగాక వీరావేశాలతో కార్యసాధన జరుగు తుందా? జ్వాలాముఖి చెపుతున్నట్లు ఆవేశాన్ని ఆలోచన అచరణోన్ముఖం చెయ్యాలి.

విరసంలో సభ్యత్వం వర్థించిన విస్తరి కాదు ఇందులో అవకాశ వాదానికి అవకాశమే లేదు. ఏ విచ్ఛిన్నకులు చెయ్యలేని పనిని విరసంలోని ఆంతరంగిక బలహీనతలే చేస్తాయి. అరసం ఎలా చెడింది? అధ్యక్షులూ, ఉపాధ్యక్షులూ, కార్యవర్గ సభ్యులు ఎందరు మారినా కార్యదర్శిగా ఒకానొక పార్టీ సభ్యుడు కొసదాకా కంటిన్యూ కావడం వల్లనే! ఈ పొరపాటు విరసం చెయ్యదు. ఏ రాజకీయ పార్టీ నుంచి ఆదేశాలు తీసుకోకుండా విరసం విప్లవ సంగ్రామంలో ఒక సాంస్కృతిక సైన్యంగా పని చేస్తుంది. తొలినుంచి మనం అందరమూ ఈ విషయంలో జాగ్రత్త పడుతూనే వచ్చామని మీకు వేరే చెప్పనక్కరలేదు.

సాంస్కృతిక రంగంలో మనం చెయ్యవలసిన పనులు, నిర్వహించవలసిన బాధ్యతలు ఎన్నో ఉన్నాయి. కవిత్వ రంగంలో తెలుగు దేశం ఎప్పుడూ అగ్రగామిగానే నిలిచింది. ఇందువల్ల తతిమ్మా రంగాల్లో కృషి కొంత మందగిస్తున్న మాట వాస్తవమే. అందుచేత నేనిప్పుడొక ముఖ్యమైన నాటకాన్ని ప్లాన్ చేస్తున్నాను. (బెండయ్య గారి గది కాదు, అదీ రాస్తాను)

సినిమాలో ఉంటూనే చలన చిత్రరంగాన్ని రివల్యూషనైజ్ చెయ్యడానికి ప్రయత్నిస్తాను. ఈ యత్నాలు ఫలోన్ముఖం కాగల ఆబ్జెక్టివ్ కండిషన్స్ కూడా ఇప్పుడిప్పుడే రూపొందుతున్నాయి.

మనకి కావలసింది క్రియేటివ్ యాక్టివిటీ. గతాను గతికంగా బతకడం కాదు. ఈనాడు క్రియేటివ్ ఆర్ట్ విప్లవాత్మకంగానే ఉంటుంది. అది ఎప్పుడు, ఎక్కడ, ఎటునుంచి వచ్చినా నేను ఆహ్వానిస్తాను.

యువర్స్ బ్రదర్‌లీ.
శ్రీశ్రీ

# 130

జలగం వెంగళరావుకి

I have intended this presidential address as an open letter to the Chief Minister of Andhra Pradesh. So here goes;

Dear Sri J. Vengal Rao,

మిమ్మల్ని పేరు పెట్టి సంబోధిస్తున్నందువల్ల ఇదో వ్యక్తిగత వ్యవహారంగా భావించకండి. అసలు వ్యక్తిగా మీరెవరో నాకు తెలియదు. మీ మొగంకూడా నేను చూడలేదు. తరుచు పత్రికలో మీ ఫోటో చూస్తూనే వున్నాననుకోండి. అది వేరే సంగతి. ఆ మధ్య నేను "ఓరోరి ముఖ్యమంత్రిగా" అని ఒక పాట రాశాను. ; విప్లవ కవులను ఒక కుట్రకేసులో ఇరికించి నిర్బంధించడాన్ని ఖండిస్తూ రాశానాపాట. మీరు చదివే వుంటారు, లేదా వినేవుంటారు. అందులో మీపేరు ఉటంకించినందుకు మీరేదో బాధపడ్డారట. ఆ బాధ కేవలం అనవసరం. మీస్థానే మరో రెడ్డి, శర్మ, శాస్త్రి, సెట్టి

ఎవడున్నా నాకొకటే. అన్నట్టు మీ కాంగ్రెస్ వాళ్ళకి కులతత్వాలు ఏకోశానా లేవటగా? అలా మీరు చెప్పకుంటే మాత్రం నమ్మేదెవరు? అసలు మీ రాజకీయాలే కుల తత్వరాజకీయాలు. నా విసుర్లు ముఖ్యంగా ముఖ్యమంత్రి మీద! మీరేదో మా మేనత్త కూతురి పినమామ గారి పెదబావమరిదిని చంపించారన్న కక్షతో నేనా పాట రాయలేదు చెప్పేను కదూ, వ్యక్తిగతంగా మీతో నాకు ఎటువంటి పేచీ లేదు. వెనకటికి, కలకత్తా విశ్వవిద్యాలయ స్నాతకోత్సవంలో ఒక విప్లవకారిణి ఆనాటి తెల్ల గవర్నరు మీద పిస్తోలు పేల్చి ఏమని ప్రకటన చేసిందో మీకు తెలుసుననుకుంటాను. అయినా చెబుతున్నాను. "ఆ గవర్నరు నాకు తండ్రి వంటివారు. అయితే అతడు ప్రాతినిధ్యం వహిస్తున్న బ్రిటిష్ ప్రభుత్వం నా శత్రువు" అన్నదామె. అలాగే మీరు నాకు సోదరుని వంటివారు. ఇద్దరమూ విశ్వవిఖ్యాతి కాంచిన ఆంధ్రజాతికి చెందినవాళ్ళం. అయ్యయ్యో, మీరొక రాక్షస వ్యవస్థకి కొమ్ము కాస్తున్నారే అని బాధపడి, ఒళ్ళుమండి ఆ పాటరాశాను. మీరు పోలీసుమంత్రిగా ఉన్నప్పుడు నక్సలిజాన్ని నాశనం చేసినట్లు కాంగ్రెసు వర్గాలు ఇప్పటికీ మిమ్మల్ని కీర్తిస్తున్నాయి. కాని నక్సలిజం అంత సులువుగా నాశనం కాదండి మహాశయా! ఆ యిజానికి కారణభూతాలైన అజ్ఞానమూ, అనారోగ్యమూ, నిరుద్యోగమూ లాంటి ఈతి బాధల్ని మీరు నాశనం చేస్తే అప్పుడు నక్సలిజం తనంతట తానే అంతర్ధానమవుతుంది. ఇంతకూ నక్సలైట్లంటే ఎవరనుకున్నారు? కొందరు చిత్రించబూనుకున్నట్లు వాళ్ళు బందిపోటు దొంగలూ, హంతకులూ కారు. ధర్మయోధులండీ వాళ్ళు. అమరజీవులు. వాళ్ళకు పోగొట్టుకోవడానికేవీ లేవు, ఒక్క ప్రాణాలు తప్ప! ఆ ప్రాణాలను మీరు తీసుకున్నా వాళ్ళు చిరంజీవులుగానే ఉంటారు. రకరకాల వికార ప్రచారాలతో, కువ్యాఖ్యానాలకు గురి అవుతున్న వాళ్ళ మహదాశయాలు మన ప్రజానీకానికి విస్పష్టంగా విశదమయేటట్లు రచనలు సాగించడమే మా విప్లవ రచయితల సంఘ సభ్యుల కర్తవ్యం.

కేవలం సాయుధ పోరాటాన్ని కీర్తిస్తూ రాతలు రాయడం ఒక్కటి మాత్రమే మా పనికాదు. సర్వతోముఖమైన సాంస్కృతిక విప్లవాన్ని సాధించడమే మా ధ్యేయం. ఇటీవల మీ సాహిత్య అకాడమీ వారు మా కాళీపట్నపు రామారావుగారి కథలకు బహుమతి ప్రకటించడమూ, దాన్ని రామారావుగారు తిరస్కరించడమూ మీకు తెలిసే వుంటుంది. ఆ సందర్భంలో అకాడమీ వాళ్ళు ప్రాచీన సంప్రదాయాల్ని ఆరాధించడమే తమ ఆశయమనీ, హింసా పద్ధతులను అసహ్యించు కుంటున్నామనీ నిర్లజ్జగా సెలవిచ్చారు. మన తెలుగువాళ్ళ పూర్వోన్నత్యాన్ని చాటించడం కోసం తమ ప్రభుత్వం ప్రపంచ తెలుగు మహాసభలను జరిపించ బోతున్నట్టే! నాకు తెలియక అడుగుతాను గాని, మన తాతలు నేతులు తాగిన భోగట్టా లక్షలాది రూపాయలు ఖర్చుచేసి ప్రపంచానికి చెప్పవలసిన అవసరం ఏమొచ్చిందండీ! అక్కడే ప్రపంచ తెలుగు మహాసభల ధ్యేయంతో నేను వ్యతిరేకిస్తాను. విరసం తోడ్పాటు లేని మీ మహాసభలు డెన్మార్కు యువరాజు లేని హామ్లెట్ నాటకమే అవుతాయి. విరసం మీ మెల్లకంటి చూపులకు ఆనక పోవచ్చును. కాని భారతదేశ సంస్థలన్నింటిలోనూ అగ్రస్థానం విరసానిది. సాహిత్య అకాడమీల కన్నా మిన్న మా విరసం. వెయ్యి మంది విశ్వనాథలు మా వరవరరావొక్కడికి దీటుకారు. గ్రంథాలు చదివి రామాయణాలెవరైనా రాయగలరు. వరవరరావులాగ, చెరబండరాజులాగ జీవితాన్ని చదివి, అర్థం చేసుకుని కావ్యరచన చెయ్యగలిగినవాళ్ళు ఏకాలంలోనైనా చాలా కొద్దిమందే వుంటారు. అయినా వాళ్ళలోని విశేషాలను మీ లాంటి వాళ్ళకు వివరించబూనడం, గిరీశం చెప్పినట్లు throwing pearls before swine అనీ అనక తప్పదు.

ఈ ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంలో ఏలినవారికొక సలహా ఇవ్వడానికి సాహసించనివ్వండి. మీరు తెలుగు భాషని ఉద్ధరించడానికీ, తెలుగు జాతిని సమైక్య పరచడానికీ కంకణం కట్టుకున్నారని మీ అభిమాన పత్రికలు అదేపనిగా రాసేస్తున్నాయి. అయితే మీరు హైద్రాబాద్‌ను ముమ్మొందుగా తెలిగించండి. భాగ్యనగరం అని దానిపేరు మార్చండి. అలాగే ఆంధ్రప్రదేష్ అనే అపభ్రంశరూపాన్ని తెలుగునాడుగా మార్చండి. అకారాదిలో వెనుకబడిపోతామన్న బెంగ మీ కక్కర్లేదు. దరిద్రంలో మొదటిస్థానం కంటె అకారాదిలో ఆఖరిస్థానమే మేలు. తమిళనాడు కడపంక్తి వాళ్ళలో వున్నా కేంద్రం ముక్కు పిండి ఎలా బతకనేర్చారో చూశయినా బుద్ధి తెచ్చుకొండి. ఇప్పుడు నేను చెప్పినవి చెయ్యడానికి ఇందిరమ్మగారి అనుమతి అనవసరం. శాసనసభలో మీకు ఎక్కీ తొక్కీ మెజారిటీ ఉంది. ఈ మార్పులు చాలా చిన్న మార్పులు. ఇవి చెయ్యడానికి ప్రజలఖర్చు మీద పదిమార్లు ఢిల్లీకి విమాన ప్రయాణాలు చెయ్యనక్కర్లేదు. ముందు ఉట్టి కెగరండి. తర్వాత స్వర్గం మాట చూసుకుందాం.

ఇంకో చిన్న ఉట్టీ, స్వర్గం ఉదాహరణ ఇస్తాను. మీకు దళిత బాంధవులనీ, పతిత పావనులనీ ఒక కీర్తిని మీ భక్తులు అంటగడుతున్నారు. పేదలకు ఇళ్ళూ, బాంకుల్లో రుణాలూ, సేద్యానికి భూమీ, చిన్నతరహా పరిశ్రమలూ - ఇలా ఒకటేమిటి ఇలాంటి వెన్నో ఇచ్చి అమాంతంగా మీరు భూలోకస్వర్గాన్ని తెలుగునాట స్థాపించబోతున్నారట. చాలా సంతోషం. అయితే ఇక్కడ కూడా మీ నిజాయితీకి ఒక్క చిన్న పరీక్ష పెడుతున్నాను. ఎవరో చెప్పినట్టు మామూలు మనిషికి నిజం చెప్పకపోతే దినం వెళ్ళదు. రాజకీయవేత్తకి అబద్ధాలాడకపోతే క్షణం గడవదు. చూడండీ! ఈ యేడేళ్ళుగా ఇందిరమ్మగారు ఎన్నెన్ని పేకమేడలకి పునాది వేసిందో? మీరో చిన్నపనిచేసి పెట్టాలి నాకు. చూశారూ. ఈ బిచ్చగాళ్ళతో వేగలేకపోతున్నాం. అట్టడుగు జనాభా అంటే వీళ్ళే కదా? నేను తెలుగునాటిలో తరుచు రైలు ప్రయాణాలు చేస్తూ ఉంటాను. సెకెండ్ క్లాసులో! అదే లెండి నూట పదకొండులో ఒక నిలువుగీత చెరిపేసి మూడోక్లాసుని రెండో క్లాసుచేశారే దాన్లో! ఒక్కొక్క స్టేషన్‌లో బండి ఆగగానే బిచ్చగాళ్ళు ఎగబడతారు. బహుశా వీళ్ళకి పై తరగతి డబ్బాల్లో ప్రవేశం ఉండదనుకుంటాను. అవి మేకుబందీలతో మాంచి పకడ్బందీగా ఉంటాయి. ఎటొచ్చీ ఈ కుంటివాళ్ళూ, గుడ్డివాళ్ళూ ఇంకా ఇంకా ఈ సైన్యం అంతా బళ్ళల్లో ప్రవేశిస్తారు. కాని, ఇటీవలి కాలంలో నేనొక విశేషం గుర్తించాను. మన మధ్యతరగతి ప్రయాణీకుల్లో దానధర్మాలు చేస్తే పరలోకపు బాంకులో పుణ్యం డిపాజిట్ అవుతున్న భ్రమ లింకా పోలేదు. గాని దానాలు చెయ్యడానికి డబ్బుల్లేక బిచ్చగాళ్ళని ఉత్తచేతుల్తో పంపించేస్తున్నారు. నా దగ్గర తగుమాత్రం చిల్లరడబ్బులున్నా దానధర్మాలవల్ల దరిద్రం పెరుగుతుందే గాని తరగదని తెలిసిన వాణ్ణి కాబట్టి నేనూ వాళ్ళని పొమ్మనే అంటూ వచ్చాను. అప్పుడు నాకు నోటిదాకా ఒక మాటవచ్చి ఆగిపోయేది, 'ఓయ్ బిచ్చగాడా! ఇలా మమ్మల్ని వేధిస్తే ఏం ప్రయోజనం! ఆ దీన బాంధవుడున్నాడే ఆ వెంగళ్రావుగారి దగ్గరికి పొండి! ఆయనే మిమ్మల్నందర్నీ ఆదుకోగల సమర్థుడు!' అని అనాలని అనిపించేది. కాని ఆమాటంటే వాళ్ళ దరిద్రాన్నే అవమానించినట్లవుతుందని ఊరుకుంటాను.

అయ్యా! వెంగళరావుగారూ! మీకో పెద్ద భవంతి ఉంది. అందులో ఒక గదిని పాతికమంది గుడ్డిబిచ్చగాళ్ళకి కేటాయించండి. మీ జీతంలోనే ఒక పాతికో పరకో పెట్టి వాళ్ళనో ఏడాది పాటు పోషించండి. వాళ్ళు గుడ్డివాళ్ళే గాని కుంటివాళ్ళు కాదు గదా! వాళ్ళకి మృదంగం, వీణ, వయొలిన్, వేణువు ఏదోఒక విద్య చెప్పించండి. సంగీతానికి అదీ సార్థకత. అంతేగాని రేడియోలో ఊదరగొట్టడం కాదు. శాస్త్రీయ సంగీతం అంటూ కప్పలు బెకబెక లాడినట్లు ఆమాటకొస్తే, శాస్త్రీయ కళలన్నీ ఎందుకవసరమో, వాటిని ప్రజా ప్రయోజనాల కోసం ఎలా మలచుకోవాలో తరవాత చెబుతాను. ఇప్పుడీ బిచ్చగాళ్ళ బృందగానం గురించి! ఏడాదిలో వాళ్ళు "లంబోదర లకుమికరా" గాని, వాతాపి

గణపతింగాని అపస్వరాలూ లయభంగాలూ లేకుండా ప్రదర్శన ఇవ్వగలరు. ఈ చోద్యం చూడడానికి విదేశాలనుండి తండోపతండాలుగా హిప్పీలు వస్తారు. ఏలినవారి విదేశీ మారకపు కొరత ఇందుమూలంగా కొంతలో కొంతయినా తగ్గవచ్చు. ఏం ఈ మాత్రపు పనయినా చెయ్యగలరా, లేక దీనికి కూడా ఇందిరమ్మగారి క్లియరెన్సు కావాలా? (అన్నట్టు గణపతిభజన నాకిష్టం లేదు. కావలిస్తే ''అన్నమో రామచంద్రా'' అనే పల్లవితో ఒక భక్తిగీతం రాసిస్తాను.)

మృదంగం అంటే జ్ఞాపకం వచ్చింది. మా ఆవిడ పదిహేనేళ్ళ కిందట కర్ణాటక సంగీత కాలేజీలో చదివి పట్టా పుచ్చుకుంది. ఇప్పుడు మళ్ళీ అదే కాలేజీలో మృదంగ వాద్యంలో పై చదువుకోసం చేరింది. తెల్లారి 5 గంటలకి మృదంగసాధన చేస్తూ ఇల్లెగరగొడుతుంది. ఇరుగు పొరుగు వాళ్ళకి నిద్రాభంగం అనైనా ఆలోచించదు. ఇలా కృషిచేసి నువ్వు మళ్ళీ వెయ్యేళ్ళ కిందటి విద్యనే ప్రదర్శిస్తావా, లేక దానిలో సృజనాత్మకమైన ప్రయోగాలు చేసి సమాజ ప్రయోజనాన్ని సాధిస్తావా అని అడిగేను. వైజయింతీమాలాబాలీ ఈ మధ్య మద్రాసు వచ్చి సక్కుబాయి పిండిరుబ్బడాన్ని భరతనాట్యంలో ప్రదర్శించి వందలూ యాభైలు టిక్కెట్లుపెట్టి ఇక్కడి రసిక ప్రియులను ఆనందాబ్ధిలో ఓలలాడించింది. ఇదీ ఒక రకం దోపిడీ విధానమే అంటాన్నేను. మనం కూడా అదే పని చేస్తూ ఈ దోపిడీలో వాటా పంచుకుందామా అని అడిగేను. అది తప్పేగాని మరి నేను నేర్చుకుంటున్న ఈ శాస్త్రాన్ని ఏం చెయ్యడం అంది మా ఆవిడ. శాస్త్రీయమైన పునాది అన్ని కళలకీ అవసరమే. ఆ పునాది మీదనే సృజనాత్మకమైన నవసమాజ నిర్మాణం సాగాలి. మాటవరసకి, నీ మృదంగం మీద, చాలా కాలానికి మళ్ళీ కలుసుకుని, కౌగలించుకున్న భార్యాభర్తల హృదయస్పందనల్ని మ్రోగించగలవా? కొడుకు చచ్చిపోతే గుండె బాదుకుంటున్న ఇల్లాలి బాధని పలికించగలవా? ఇవి శృంగార కరుణరసాలు. ఒకటిరాణీ, ఒకటి రాజు! అది రాజరికపు వ్యవస్థలో. ఇవాళ ఆ వ్యవస్థ లేదు. దాని అవశేషాలు మాత్రం మనమీద గుదిబండలాగ కూర్చున్నాయి. ఇప్పుడు మన కర్తవ్యం సంగీతాన్ని శ్రామికవర్గ ప్రయోజనాల వైపు మళ్ళించడమే అన్నాన్నేను.

ఒక్క సంగీతమే కాదు, అన్ని కళలూ ఈనాడు పెట్టుబడిదారీ విధానపు ఇనుప సంకెళ్ళకు కట్టుబడి ఉన్నాయి. ఈ సంకెళ్ళను బ్రద్దలు కొడుతున్నారనే కదా విరసం కవులకు సర్కారు వాళ్ళు సంకెళ్ళు వేస్తున్నారు! అయ్యా వెంగళరావుగారూ, మీరెవరి ప్రయోజనాలు కాపాడడానికి గద్దెనెక్కారో మాకు తెలుసును. మీరు చెప్పే కబుర్లు కాదు, చేసేపనులు మాకళ్ళు తెరిపిస్తున్నాయి.

- 1975 (అముద్రితం)

*తొలి ప్రపంచ తెలుగు మహాసభల (12-4-1975) కన్నా ముందురాసింది.*

# 131

Madras,
8-8-75

శేషేంద్రశర్మకి

1975 ఆగస్టు 13 రాత్రి 9.30కి Madras B నుంచి శ్రీశ్రీ రేడియో నాటిక దడిగాడు వాన సిరా.

Yours Sri Sri

## 132

Madras,
20-8-75

Dear కృష్ణాబాయి గారూ!

మీ ఉత్తరం అందింది. I think many surprising things will happen in the near future. నేను జ్యోతిష్కుణ్ణి కాను గాని, instinctive గా feel అవుతున్నాను.

ఈ మాసాంతంలో నేను "ప్రజాతంత్ర" ప్రథమ వార్షికోత్సవ సందర్భంగా హైద్రాబాద్ వెళ్లుతున్నాను.

Prize స్వీకరించడం, నిరాకరించడం ఇంకా నిర్ణయించుకోలేదు. There is still plenty of time.

Yours Sincerely
Sri Sri

## 133

Madras,
27-9-75

Dear Krishna Bai garu,

Living in a state of suspended animation I have been unable to reply to both your letters which reached me intime.

There is no script award for తీర్పు.

The Delhi Mughuls have not cared to inform me when and where their function is going to take place.

One letter from Delhi, dated 2nd June reached me on 4th July not exactly a world record but certainly Indian, certainly emergent.

Yours
Sri Sri

## 134

Madras,
4-10-75

Dear Krishna Bai garu,

మీరు రాస్తున్న ఉత్తరాలన్నీ సకాలంలో (అనగా ఒకరోజు ఆలస్యంతో for obvious reasons)అందుతున్నాయి. నేను వెంటవెంటనే జవాబు రాయలేకపోతున్నాను. ఈ మధ్య "దడిగాడు

వాన సిరా" అనే ఒక 1/2 గంట రేడియో నాటకం రాసి ప్రొడ్యూస్ చేశాను. అది "ఫిల్మాలయ" (సినీమా పత్రిక) సెప్టెంబరు సంచికలో పడింది కూడా. దాన్ని 1½ లేక 2 గం.లకు blow up చేసి stage play గా రాయాలని ఉంది. (ఫిల్మాలయా version లో చాలా అచ్చు తప్పులున్నాయి)

ఈ ఉత్తరం మీకు రెండు రోజుల క్రితమే రాసి ఉండవలసింది. కాని అక్టోబరు 2 గాంధీ గారు (God) పుట్టిన రోజు కాబట్టి సెలవు. అక్టోబరు 3 కామరాజు గారు చచ్చిపోయారు కాబట్టి సెలవు. We delight to take a holiday at the slightest provocation. Blunt గా చెప్పాలంటే we are a nation of lazy beggars.

నిన్న మద్రాసు మహానగరాన్ని చూడడానికి రెండు కళ్ళు చాలవు. చాలా హంగామా జరిగింది. నిన్నంతా సుమారు 10 మైళ్ళు నడిచి ఉంటాను. (for lack of transport) సొంత పనుల మీద. Two phrases were constantly ringing in my mind. 1. శవసంస్కృతి, 2. నపుంసక రాజకీయాలు. వీటి ఆధారంగా బోలెడు రాయడానికి వీలుంది. అయినా అచ్చు వేసేదెవరు? వేస్తే చదివేదెవరు? చదివితే అర్థం చేసుకునే దెవరు?

సిరా అయిపోతే కలంలో నీళ్ళు పోసి ఈ ఉత్తరం రాస్తున్నాను. అందుచేత clarity ఒక casuality కావచ్చు.

నా ఆర్థిక పరిస్థితి ఎప్పటిరీతిగానే బాగులేదు. "తీర్పు" చిత్రంలో మాటలు : శ్రీశ్రీ అని మాత్రమే క్రెడిట్ ఉంది. సినిమాకి screenplay అనవసరం. ఢిల్లీవాళ్ళకి ఉత్తరం రాస్తే జవాబు రాలేదు. (ఇంత క్రితం వాళ్ళ జూన్ 2వ తేదీ ఉత్తరం నాకు జులై 4వ తేదీని అందింది! ఢిల్లీ సర్కార్ జిందాబాద్!)

Can you please do me a good turn? శ్రీశ్రీ సన్మాన సంఘం ఎకౌంట్‌లో ఏమైనా డబ్బు మిగిల్తే ప్రసాద్‌గారి సంతకం తీసుకుని (along with Donappa's) నాకో cheque పంపగోరుతాను.

Yours Sincerely

Sri Sri

## 135

Madras,

23-10-75

Dearest Seshen,

This is to request you to wire me Rs. 250/- (Two hundred fifty).

Just now I put up a trunk call for you. If you are available I shall make an oral request.

I read Tirumala Ramachandra's account of the multi language Kavi Sameelanam.

I am sure you would have dominated the entire show. Hence I wish the subject matter is not Gandhi but something else!

Yours

Sri Sri

## 136

Madras,
30-10-75

To,
Seshandra Sarma
My dear Kshemendra,

Thanks for timely help (end of the month). I could not contact you over the phone the other day. I used the number you gave me 46098. Please give me the correct number as well as the PIN number ofYr postal district. My tel.No. is 73733

Yours Sincerely
Sri Sri

## 137

Madras,
6-1-76

Dear Krishna Bai garu,
వెంటనే జవాబు రాయనందుకు క్షమించండి.
"భూమ్యాకాశాలు" అని ఒక poem రాశాను (ఉరితీయబడ్డ కామ్రేడ్స్‌ని అభినందిస్తూ)
Happy to learn that Sri Venu is released.
I am keeping in different health.
నా ఉత్తరాలను దొంగతనంగా చదవడం సాగుతూనే ఉంది.

Yours Sincerely
శ్రీ శ్రీ

## 138

Madras,
11-7-76

ఎల్. బాదేశ్వరరావుకి

Dear Comrade,
Thanks for your letter 5 / 9th inst.
The following are my suggetions for the forth coming publication.
1. Print only my Cine lyrics. Don't mix up others.
2. About a hundred (Which I'll select)
మీ లిస్టులో రెండు మూడు పాటలు నేను రాయలేదేమో అని అనుమానం. My name in print is no guarantee.

3. Please take the trouble of collecting all the song books of the films for which I have written lyrics. This is a big job. But done it must be. 1950 "ఆహుతి' మొదలు 76 జూన్ "రక్తపాశం" వరకు (include all dubbed films)

4. "జగన్మోహిని" అనే డబ్బింగ్ ఫిల్ములో 12 పాటలున్నాయి. అందులో 10 ఒకే రోజున రాశాను. This is a world record. ఈ విషయం పాఠకులకి తెలియాలి.

5. About the title. I'll suggest it myself. Lets first gather all the songs.

6. Dedication "పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి" కి.

7. పీఠిక - may be dispensed with లేదా bysome one intimately connected with the film field.

8. When every thing is ready will meet at Vijayawada. బహుశా Hotel Manorama లో

Yours Sincerely

శ్రీ శ్రీ

Reply at your early convenience. *మనం పెట్టుబడిదారీ సమాజంలోనే ఇంకా బతుకుతున్నామని మరవొద్దు. వెయ్యి రూపాయల పెట్టుబడిని పదివేలు చెయ్యలేకపోతే మనం కేవలం పనికి రానివాళ్లమన్నమాట.*

# 139

Central Bank Rd.,
Madras - 28
20-9-77

బూదేశ్వరరావుకి

Dear friend,

మీరు మద్రాసు రానక్కరలేకుండానే 10 లోపున అచ్చు పూర్తి చేయిస్తాను. (give me your full address) 1950(ఆహుతి) మొదలు 1977 దాకా పాటలు పుస్తకాలు సంపాదించి 100 పాటలు select చేసి అచ్చు వేయడం మంచిదనుకున్నాను. ఇక్కడ శ్రీ VAK రంగారావు గారి దగ్గర కొన్ని పుస్తకాలు మాత్రమే ఉన్నాయి. కాబట్టి నా ఉద్దేశం (తాత్కాలికంగా) విరమించుకుని 50 పాటలు మాత్రమే మొదటి సంపుటిగా వేయిస్తాను. చాలా వరకు మీ లిస్టులోనివే ఉంటాయి.

అచ్చు వెయ్యడం ఒక పెద్దపని కాదు. వేసిన వాటిని మార్కెట్ చెయ్యాలి. నేను క్రాంతి ప్రెస్ హనుమంతరావు గారితో మాట్లాడి, రెండు మూడు రోజుల్లోనే వివరాలు రాస్తాను. (మీ జవాబులో PIN Code నంబరు ఇవ్వండి)

Yours
Sri Sri

## 140

Madras,
6-4-77

ఇందిరా రాజ్‌ధనగిరి,
శేషేంద్రలకి

Dear Madame,

Many many many (to the power of n) thanks for the lavish gifts of poetry from శేషేన్ and your good self.

That I have not acknowledged even a single one of your mailings damning me to eternal HELL (if such a thing exists)

That I am still alive is the greatest joke of this century.

I write this in the gloom of my room, illuminated by the electricity of your poetry.

I am a poor man enriched with four daughters and a son.

This winged poverty is my poetry. Accept the same with my best compliments.

మీ
Sri Sri

Dear Seshen

శేషేంద్రా!

Quel quolidien est la vie!

ఎంత దైనందినం జీవితం!

నేను బహుశా ఈనెల రెండోవారంలో హైద్రాబాద్‌లో ఉంటాను. I received all your books. They are great. More in person.

Yours
Sri Sri

## 141

Madras,
26-12-77

చలసాని ప్రసాద్‌కి

Dear friend,

"అనంతం" ఆగిపోలేదు. రాత సాగిపోతూనే వుంది. ప్రచురణ కూడా త్వరలో ("ప్రజాతంత్ర" లోనే.)

"మరో ప్రస్థానం" తక్షణమే అచ్చుకిచ్చెయ్యొచ్చు. కాని 1980 దాకా ఆగాలని నా ఉద్దేశం. ("మహాప్రస్థానం" 1950లో అచ్చయింది.)

జనతా ప్రచురణల address ఇవ్వండి. లేదా, నాకు ఉత్తరం రాయమనండి. "నా చైనాయానం" అచ్చుకి సిద్ధంగా ఉంది. (అయితే దాన్ని 'ప్రజాతంత్ర' వాళ్లు అచ్చువేస్తామన్నారు. అంటూనే ఉన్నారు!)

ఈలోగా నా సినిమా పాటలు (50నుంచి 75 దాకా) అచ్చు చేయించదలిచాను. కృ శా. చేత ఇంట్రో రాయించాలని వుంది. This is a purely commercial proposition. జనతా రెడ్డి గారు ఇష్టపడతారా? ఆయన్ని Sound చెయ్యండి.

Thesis ఉత్తరం నా దగ్గరలేదు. సరోజా, పిల్లలూ క్షేమం.

మీ టెలిఫోన్ నంబరు పాతదేనా? ఎక్కడుంది సిరిపురం?

మనం బెజవాడలో కలుసుకున్నప్పుడు Sri Sri ఫండ్ గురించి ప్రస్తావించాను. Bottom of the barrel లో ఏమీ మిగల్లేదా? మిగిల్తే U. Saroja పేరిట ఒక చెక్కు పంపించండి.

All India Radio కి "గాలి దారాల దేవతా వస్త్రాలు" అని ఒక కథ రాయాలి.

9-1-78లో broadcast అవుతుంది. శీర్షిక కావాలంటే ఇచ్చాను. కథకింకా కాళ్లూ చేతులూ రాలేదు.

(వాడా దొరికింది. గుర్రాన్ని వెదకాలి)

"సృజన" "అరుణతార" వచ్చాయి. రెండింటికీ త్వరలో poems పంపిస్తాను.

We shall all be meeting again in Chirala

Yours Sincerely
Sri Sri

# 142

Madras,
18-4-79

Dear Prasad garu,

I am starting for Vizag on 20th night by Howrah Mail (or on 21st by coromandel express)

I'll be taking part in the Altheist meet on 22nd. While in Vizag, I'll be staying with you.

I must be back in Madras by 24th. Rudrajwala invited me to Chirala for a Virasam meet. I'll be there on 29th.

Sometime in May I've to go to Nellore (in connection with the meeting of India - China friendship Association, Nellore district.)

These journeys are a bit tiresome but it can't be helped.

Yours Sincerely
Sri Sri

Latest (మే నెల) జ్యోతిలో నా "ఉగాది స్వగతాలు" చూశారా?

S. S.

# 143

బూదేశ్వరరావుకి

Madras,
6-6-79

Dear friend,

The film song - book is goint to the press immeditely.

Very sorry for the inordinate delay.

Copies will be ready before the end of this month.

Let me know how many copies you want. Also, how to acknowledge your help (in a single sentence).

It is my intention to dedicate this collection to your association. I hope I have your permission. Write to me how exactly the deidcation should be worded.

Please show this letter to your friends and tell them. I feel very much for the mental agony I caused.

On 24th inst. I'll be in Vijayawada to partake in a Kavi Sammelan by A.I.R.

With best wishes.

Yours Sincerely
Sri Sri

# 144

Madras,
17-10-79

Dear Sri K.V.R.

కాకినాడ సభల బహిష్కరణ విషయమై ప్రసాద్‌గారితో కాస్త క్షుణ్ణంగానే చర్చించాను. అవి అరసం ఆధ్వర్యంలో జరుగుతున్నవి కావు. ఒక broad-based citizen's committee అందు నిమిత్తం ఏర్పడింది. బహుశా జ్యోతి, స్వాతి పత్రికలు కూడా అదే వేదికపై నన్ను సన్మానించవచ్చును. ముఖ్యంగా శ్రీ మిరియాల రామకృష్ణ thesis ని ఆవిష్కరిస్తానని నేను లోగడ మాటిచ్చాను. Exclusive గా అరసం ప్రమేయం లేకుంటే ఆ సభలో పాల్గొనడానికి ప్రసాద్ green signal ఇవ్వడం జరిగింది. అరసం ఆధ్వర్యంలో మాత్రమే అయితే అసలే నేనొప్పుకోనని హామీ ఇచ్చాను. This has satisfied him.

అయినా ఆ సభలు జరిగేది మార్చిలో. చాలాటైముంది. ఈలోగా ఇంకెన్ని పరిణామాలు జరుగుతాయో? ఇప్పటి నుంచీ ఎందుకు మనం యెలకల్ని వాసన చూడడం?

For my part, I would very much like to sec a left front of writers emerging under the leadership of R.W.A.

ఇంకో రెండో విషయం.

"మరో ప్రస్థానం" కావ్య సంపుటి (in a way, the sequal of మహాప్రస్థానం) నిస్సందేహంగా విరసం పతాకం కిందనే వెలువడుతుంది. అయితే ఆ సంపుటి 1980లో ప్రకటితం కావాలని నా

అభీష్టం. చెదురుమదురుగా ఉన్న గీతాలన్నిటినీ ఇప్పటినుంచే సేకరిస్తున్నాను A good number of them are with me. తతిమ్మావి locate చెయ్యడంలో మీ సహకారం కావాలి.

సినీమా పాటలలో కొన్నిటిని ఒక friend అచ్చువేయిస్తానన్నాడు. మరో friend దగ్గరనుంచి కొంత డబ్బు కూడా అందు నిమిత్తం తీసుకున్నాడు.

1970 నుంచి విరసం అధ్యక్షోపన్యాసాలు ఒక సంపుటంగా వేస్తే బాగుంటుందేమో ఆలోచించండి.

ఎర్ర పిడికిలి ఎత్తుతూ.

శ్రీశ్రీ

# 145

Madras,
9-1-80

Dear K.V.R.

శిష్ట్లా "విష్ణుధనువు" సంపాదించారా? "మారో మారో" "నవమి చిలుక" లో ఉంది. నేనెప్పుడూ శిష్ట్లా ముఖతః recitations వినలేదు. బరంపురం సభలో కొన్ని poems శివశంకరశాస్త్రి గారు వినిపించారు.

"అరుణతార" latest issue నేను చదవకముందే ఒక మిత్రుడు borrow చేసి (మద్రాసు నుంచి) వెళ్ళిపోయాడు. ఇంకో కాపీ పంపగోరుతాను.

I am not too eager to attend the Kakinada function.

Yours Sincerely
Sri Sri

# 146

Madras,
8-2-80

Dear K.V.R.

Enclosed please find a cheque for Rs. 100/-

Deduct Arunatara subscription and credit the balance to comrade cherabandaraju nidhi.

Hyderabad function is going to be presided over by either Krishna or NTR.

I am attending Kakinada function where అరసం will be in the background - I am assured.

Yours Sincerely
శ్రీ శ్రీ

## 147

Madras,
7-4-80

Dear Sri Prasad,

You have my permission to use my article on Krishna Sastri in the forth coming souvenir.

Also, you can include the following

"అద్దం బద్దలయింది
రోదసి రోదించింది
షెల్లీ మళ్ళీ మరణించాడు
వసంతం వాడిపోయింది"

"శంకరాభరణం" గురించి :

ఇంతవరకు సినిమా సెక్సునీ violence నీ glamorize చేసి డబ్బు చేసుకుంటోంది. శంకరాభరణం classical music ని glamorize చేసింది. so far so good. అంతవరకు Viswanath ని అభినందించవలసిందే. But the end result is not only the reactionary - it is also anti-revolutionary.

Express article చూళ్ళేదు.

Yours Sincerely
Sri Sri

---

సావనీర్ . కృష్ణ శాస్త్రి చనిపోయిన (24-2-1980) తరవాత ఆయన గురించి కొందరు మిత్రులు ఒక సావనీర్ వేద్దామనుకున్నారు. అందుకోసం వ్యాసాలు పోగు చేశారు. కాని సావనీర్ వెలువడలేదు.

---

## 148

శ్రీ శ్రీ
23-4-80

My dear (Costly) K.V.R.

I wrote a letter in reply to your dear and undar broadside but didnot post it. It is still with me. Therein I accepted you as my conscience keeper. I still do.

But I am not a little worried and confused. Till recently, it was "My China right or Wrong". But now I am unable to appreciate the religious obscurantists of Pakistan and captalist murders of U.S.A. I support Soviet action in Afghanistan.

More than everything else, I am spending anxious moments ever since I sent all the MSS and press cuttings of my poems to Varavara Rao and I am afraid, the packet is lost in transit. I affixed a 50 paise stamp and wrote on the packet, "Extra postage 'll be paid by the addressee."

I hope the packet has reached him. There are several unpublished poems which I reserved for "మరోప్రస్థానం" . If the packet is lost, everything is lost. I wrote a reply card to Vara Vara Rao yesterday & this suspense will be broken only after I hear from him.

I shall meet K K in a day or two. Varavara Rao wants me to contact Arudra also.

My heart is still with R.W.A. but my mind - well, it is Wandering.

Yours fraternally,
Sri Sri

1980 is 1970, nor isn't Kakinada, Vizag or H'bad.

# 149

Madras,
29-4-80

KVR,

నిరోక్ష్య కవిత్వంలాగ నిరాబ్జెక్టివ్ ఉత్తరం రాస్తున్నాను. మీ ఉత్తరంతో బాటే 'మరో ప్రస్థానం" కాపీ వచ్చింది. దాన్నిండా చాలా అచ్చుతప్పులు దొర్లాయి. నేను పంపినవన్నీ అందినట్లు దాఖలాలున్నాయి గాని కొన్ని ముఖ్యమైన గీతాలు లేవు.

For instance లెనిన్ మీద

"స్పందించే ట్యూనింగ్ ఫోర్క్
అరెరె దమ్మిడీ దొరికింది"

which appeared in సృజన

ఇలాగే మరికొన్ని

మీరేమో don't rush అంటారు. వరవరరావుకు రాయండి. He seems to be a man in a hurry.

రేపు నేను తెనాలి వెళ్తున్నాను. 2వ తేదీని బెజవాడలో ఉంటాను. C/o. ఎడిటర్, "స్వాతి", గవర్నరు పేట అని విజయవాడకు రాయండి.

(నేను పంపిన వాటిలో బోలెడు చెత్త వున్నమాట నిజమే. మీరు చెప్పినట్లు, తొందర పడకుండా ఒక final version అందరం కలిపి తయారుచేద్దాం)

వరవరరావుకు ఇవాళే ఉత్తరం రాస్తున్నాను.

అఫ్ఘనిస్తాన్ విషయంలో ఇప్పటికీ మీతో ఏకీభవించలేకపోతున్నాను. I think, I believe communism is greater than individualism.

Anyway, let us agree to differ.

Yours fraternally
Sri Sri

*P.S. ఎంత మొద్దుబారినా నాకూ ఒక conscience ఉంది. దానికి మీరే Keeper.*

*SS*

# 150

Madras,
9-5-80

Dear Sri K.V.R.

ఇవాళ మెయిల్లోనూ, సర్కార్‌లోనూ రిజర్వేషన్ దొరకలేదు. రేపటి Coromondel వంటి పగటి ట్రెయిన్లలోనూ దొరకలేదు. రేపు సర్కార్‌లో ఒక సీటు సంపాదించాను. 11 ఉదయం సభలకి వస్తున్నాను.

'మరో ప్రస్థానం' ఆవిష్కరణ 11 వ తేదీ సాయంత్రానికి ఏర్పాటు చెయ్యగోరుతాను.

Yours Sincerely ,
Sri Sri

# 151

No.1 SBR,
Madras-28.
29-5-80

Dear KVR,

Rest assured I will reject invitation for Kinnera సన్మానం.

I've just received a rather longish letter from Varavara Rao. I'll be meeting him at Kazipet Rly. Station on 1st morning. 31వ తేదీకి బయల్దేరి హైద్రాబాదు వెళ్తున్నాను.

1వ తేదీకి అచ్చటి Rly Employees సాంస్కృతిక సమితి ఆహ్వానంతో.

ఆరోజే "నగ్నసత్యం unit కి సన్మానం కూడా.

You and I know these sanmanams are not worth.

Yours Sincerely ,
Sri Sri

# 152

Madras,
31-5-80

Dear Prasad,

వరవరరావుకీ, KVR కీ నిన్ననే ఉత్తరాలు post చేశాను. ఎట్టి పరిస్థితిలోనూ కిన్నెర సన్మానాన్ని అంగీకరించేది లే"దని

July నెలలో లండన్ ప్రయాణం. Most probably with my worst half.

June నెలలో నేను విశాఖ రాగల ఏర్పాట్లేవేనా చెయ్యగలరా?

Yours Sincerely ,
Sri Sri

---

*కిన్నెర సన్మానం - కిన్నెర సన్మానాన్ని శ్రీశ్రీ అంగీకరించాడు. హైదరాబాద్ సిటీ విరసం యూనిట్ సభ్యులు శ్రీశ్రీని ఘెరావ్ చేసి "సన్మానాలు కావాలా విరసం కావాలా" అని అడిగితే, "నాకు రెండూ కావాలి" అని సన్మానానికెళ్ళిపోయాడు శ్రీశ్రీ*

---

# 153

మద్రాసు,
22-7-1980

విరసం కార్యదర్శి కె.వి.ఆర్.కి

Dear Comrade Secretary,

This is to inform you that I am withdrawing my resignation from Virasam.

Yours Sincerely ,

Sri Sri

P.S. Enclosed a cheque for Rs. 100/-
being my contribution to Virasam Fund.

# 154

London,
1-11-80

Dear Prasad,

Don't want to repeat what Puripanda and Saroja have written in their letters. Please send a draft for Rs. 500/- (either on Indian Bank, Mandavalli Branch or Andhra Bank Mylapore branch) to S. Manjula No.1 South Bank Rd, Madras-28. This is for November. As we are likely to stay here till the end of December please send my daughter another 500 Rs. next month.

లండన్‌కి పంపవలసిన 2 వేల రూ॥ మీదగ్గరనే సిద్ధంగా ఉండనివ్వండి. ఎప్పుడు పంపాలో ఆ వివరాలు త్వరలోనే రాస్తాను. ఈ amount ఇక్కడ ఎంత అవసరమో సరోజ రాయనే రాసింది.

విరసం సభలు జేగీయమానంగా జరిగేయనుకుంటాను. "మరో ప్రస్థానం", "మరో ఝంఝ", "అరుణతార" release అయాయనుకుంటాను. మూడూ నేనింకా చూడలేదు. K.V.R. కి ఉత్తరం రాస్తున్నాను. "సృజన" కోసం వరవరరావుకి రాస్తున్నాను. మీ దగ్గరనుంచి వెంటనే జవాబుని ఆశిస్తున్నాను.

ఇట్లు

10 రథాల శ్రీశ్రీ

# 155

London
12-11-80

Dear Sri K.V.R.

ఇన్నాళ్ళకు ఇప్పుడే నిద్రనుంచి మేల్కొన్నట్లయింది. Mine host కృష్ణమూర్తిగారు ఈ 3 నెలలూ ఇండియా గురించి మరిచి పొమ్మన్నారు. వారు నా విషయమై కొన్ని మంచి పనులు తలపెట్టారు. అతి నిం...పా....ది. ..గా చీమనడకలతో సాగుతున్నాయి.

క్రిందటివారం Stanley (Country Durham) అనె గ్రామంలో కావ్య పఠనంతో మా (నా యొక్క, పురిపండా యొక్కా) Public appearence ప్రారంభమయింది. ఇలా కొన్ని వారాలు గడుస్తాయి. నాకేమో డిసెంబరు నెల మధ్యలో మరలి పోవాలని ఉంది.

విరసం సభలు జేగీయమానంగా జరిగాయనుకుంటాను. అనుకోవడమేమిటి? అది నిస్సందేహం!

విరసం విశృంఖలంగా విజృంభించాలనేదే నా సందేశం. "మరో ఝంఝ"ను నేను రాసిన poem "అరుణతార"కు, కొ.కు. మీద వ్యాసం ఇక్కడకు బయల్దేరే ముందు మీకు పంపించాను. అందే ఉండాలి

విశేషాలతో విపులంగా మీరు రాసే జాబు కోసం ఎదురు చూస్తున్నాను.

విప్లవాభివందనాలతో

Sri Sri

## 156

Madras.

5-3-81

Dear K.V.R.

This is just to seek advice from you about ప్రపంచ తెలుగు మహాసభలు. I know Virasam is dead set against the show. But suppose they invite a delegation (of at least two) I'd like to suggest your, or Varavara Rao's name. Personally I'd like to visit Malasia since there is a chance of going to Beijing from there.

Why carry our domestic quarrels abroad?

Any how, I'd like to hear from you.

Comradely Yrs.,

Sri. Sri

## 157

Madras.

6-4-81

Dear ప్రసాదు,

హైద్రాబాదు సన్మానానికి [illegible]

వేమన కేంద్రం వెటల్లో [illegible]

Vizag లో [illegible] release [illegible] వారాలు ఆడుతుంటే నాకు [illegible]

19వ తేదిని హైద్రాబాదులో [illegible]

Yours Sincerely,

Sri Sri

# 158

Madras,
8-5-81

Dear Prasad,

I hope this letter reaches you all right. As you see, I wrote the address of Mr. Joshi on this card and write the letter on another. Then I am posting it today. I asked him there in not to print any of my writings hereafter. It is my intention to do so myself. I request my VIRASAM friends to allow me to be my own publisher.

Yes! I know that background story of my States visit. Saroja and myself are starting on 17th of this month.

Sincerely Yours ,
Sri Sri

# 159

Madras,
13-5-81

Dear Prasad,

You wanted me to be firm. I'll be. I am going to be my own publisher. That 'll be after my return from the States. Do not tie yourselves into knots in the meanwhile.

Virasam belongs to the past decade. Think of the future.

Spensers కాదు. జార్జిటౌన్ సందుల్లో సవాలక్ష కంపెనీలలో ఒకటి కాలిపోయింది.

Spensers' ఆవుకీ, కుం.కు. బిచ్చగాడికీ background చెయ్యడం height of absurdity.

Yours Sincerely ,
Sri Sri

# 160

Madras,
16-5-81

Dear Prasad,

We are starting tomorrow.

Shall write to you again from Chicago.

I' ve decided to be my own publisher. I would like to start my publicatioı with మరోప్రస్థానం

Comarade Kasipathi knows the details of my scheme

As you are aware, a definitive edition of మహాప్రస్థానం (with a casette) ı appearing in London.

Saroja has written to Visalandhra, not to proceed with the printing c మహాప్రస్థానం.

So that's that. More in my next.

Yours Sincerely ,

Sri Sri

# 161

బోజ్‌మన్, అమెరికా

చలసాని ప్రసాద్‌కు

13-6-198˙

Dear K,

Here we are in the state of Montana, half way through our sojourn in the states.

I have prepared a xeroxed edition of సిప్రాలి. (సిరిసిరిమువ్వలు, ప్రాసక్రీడలు, లిమ ఋక్కులు) It is limited to 50 numbered copies each signed by the author. It is priced $ 10 (Ten dollars) more or less. I am hoping to sell all the copies in the states. On returning to India I'll start printing the series of my books begining with a definitive edition of 'మరో ప్రస్థానం'! I am thoroughly dissatisfied with the విరసం edition.

Yours Sincerely ,

శ్రీ శ్రీ

*రమణమ్మని కౌసల్య అనీ, సరోజని సుమిత్ర అనీ, ప్రసాద్‌ని కైక అనీ శ్రీశ్రీ, సరోజ అనేవారు. అందుకే K అని సంబోధించారు.*

# 162

Madras,

7-10-81

Dear బలరాం గారూ,

మీరు పంపించిన letter heads, diary etc చేరాయి. Thanks. Letter box మీద నా టెలిఫోన్ నంబరు లేదు. Never mind.

నేనూ, మా రెండో అమ్మాయి S. Manjula (B.Com) శనివారం రాత్రి (10th) బయల్దేరి విజయవాడ వస్తున్నాం. ఆదివారం ఉదయం అంతా అక్కడ ఉండి మధ్యాహ్నం గుడివాడ సభలకి వెళ్లాలి.

Packet Draft తీసుకుంటే పంపవద్దు. మీ దగ్గరే ఉండనివ్వండి.

మహాప్రస్థానం వర్ణచిత్రాల Packet ఖుర్దారోడ్డు నుంచి తెచ్చాను. ......"కవిత" సంస్థకు చెందిన వారెవరయినా వస్తారు. వాళ్ళకవి ఇచ్చెయ్యండి.

అన్నిటికన్నా ముఖ్యమైన విషయం ఆఖరుని రాస్తున్నాను. నేను నిజామాబాద్‌నుంచి ఒక్కరోజు ఆలస్యంగా వచ్చిఉంటే మరో కృష్ణశాస్త్రిని నయిపోయి ఉందును. (Voice box చెడిపోయి)

డా॥ చిట్టూరి సత్యనారాయణగారి శ్రద్ధవల్ల, రెండు ఎక్స్‌రేల, మూడు కోతల తర్వాత ఇప్పుడు మామూలుగా ఉన్నాను.

డాక్టరుగారికి నా ఫీజు : smoking శాశ్వతంగా, drinking రెండు నెలల దాకా మానెయ్యడం అలాగే చేస్తున్నాను.

Yours Sincerely ,

శ్రీ శ్రీ

# 163

Madras,
23-10-81

To Puranam

Dear Sarma garu,

Thanks for the cheque. Try to send draft next time, in the name of S. Srinivasa Rao, payable at Indian Bank, East R.A. Puram branch, Madras.

I have inquired Jaruk's short stories. Shall send review in a few days time. I am enclosing four autographed photos here with. As the Editor, you can decide which is the best question. If you send me the name (of town) of the questioner I shall immediately send you his full address.

There is a deluge of letters everyday. Kindly publish a request from Sri Sri in your weekly asking the readers to stop writing to me atleast up to Dec. 15th.

On my return from Vijayawada, my ailment was diagnosed as Cancer. I am being given intensive treatment. You'll be relieved to know that my doctor has assured me that I am out of danger.

You'll also be glad (or sorry) to that I've completely given up smoking & alcohol.

Expect to receive the diaries in the course.

Sincerely Yours ,

Sri Sri

# 164

No.1, South Bank Rd., Madras - 28
18-11-81

రమణాచంద్‌కి

Dear Sir

Thank you for your M.O. (550/- Rs.) Don't worry about my debts. They run to nearly 20,000.

I am confident that I can weather the storm.

(కేన్సర్‌తో పోరాడి జయించినట్లు!)

Yours Sincerely ,
Sri Sri

# 165

Madras ,
1-12-81

Dear Prasad,

There is absolutely no cause for anxiety. I am in the pink of health. Cancer is cancelled.

True, I should have suffocated to death (in sleep) two months ago. But that didnot happen.

I've never felt more alive than now.

Yours Sincerely ,
Sri Sri

# 166

No.1, South Bank Rd., Madras - 28
20-2-82

బూదేశ్వర్రావుకి

Dear friend,

మీ 12వ తేదీ ఉత్తరంలో ఇచ్చిన రెండుమూడు వారాల గడువులోగా నా సినిమా పాటల పుస్తకం వెలువడుతుంది. ''పాడవోయి భారతీయుడా'' అని title.

(It contains less than hundred songs)

Yours Sincerely ,
Sri Sri

# 167

Madras - 28
18-3-82

Dear Miss G.V.Ramana Chand,

Thanks for your M.O. and the kind letter on the M.O. form. I am glad to inform you that I received a purse for Rs. 25,000 at Vanaparthy and as a consequence, all my present financial worries are over. I had half a mind to return your M.O. but I thought it'd hurt you. No need for further remittance.

Do please send me some of your poems. There is an All India Radio Kavi Sammelanam at Bhopal. As soon as I receive details I'll recommend your name. They'll pay for 1st class to and fro Rly charges and Rs. 1000/- More about this in my next letter.

Yours affly,
Sri Sri

# 168

మద్రాసు,
21-3-1982

చలసాని ప్రసాదుకి

ఉన్న ఒక్క copy[1] పంపిస్తున్నాను. టైపు చెయ్యించగలిగితే ఒక copy పంపండి.

నా 'మరో ప్రస్థానం' royalties చెరబండరాజు రక్షణ నిధికి మార్పించగోరుతాను.

Yours
Sri Sri

1 = దుందుభి ఉగాది గీతం

# 169

మద్రాసు,
2-4-82

చలసానిప్రసాద్‌కి

Dear కైకయ్య గారూ,

మీ ఉత్తరాలన్నీ అందుతున్నాయి. నేనే. బద్ధకించి జవాబు రాయలేదు.

ఆరుద్ర గురించి నా అభిప్రాయం.

నారాయణ బాబు లాంటి సాహిత్య వికలాంగుణ్ణి మోసుకు తిరుగుతున్న ఆరుద్ర లందరూ నా దృష్టిలో non persons. అనగా అవ్యక్తులు.

This applies to రోణంకి also. ఈయన ఇంగ్లీషు ఫ్రెంచిలాంటి పాశ్చాత్య భాషల్లో గొప్ప పండితుడే కావచ్చుగాని, ఇతగాడికి సంస్కృతం అసలు రాదు. వచ్చిన తెలుగైనా అంతంత మాత్రం. లేకుంటే నారాయణబాబు మూగసంజ్ఞలలో అగాధమైన psychological depths ఈయన చూసి వుండడు.

గాంధీగారి నందరూ father of the nation అంటారు. రోణంకి వారి logic తో చూస్తే ఆ గౌరవం లోకమాన్య తిలక్‌కు ఇవ్వాలి. రోణంకి లాంటి వారు తెలుగుసాహిత్యం గురించి ఎంత తక్కువ మాట్లాడితే అంత మంచిది.

ఇక సుందరదోమ సంగతి దీనికి నారాయణ బాబు శ్రీరంగం సుందరనారాయణగారి రెండో కొడుకని కూడా తెలియదు. పెద్ద 'దర్శనమే' రాసి పారేసింది. ఎంత చవకయిపోయాయి దర్శనాలు!

'రుధిరజ్యోతి' రెండు editions పండిందట. మరి వాటి royalties ఎవరు కైంకర్యం చేశారో?

నారాయణబాబు గురించి పురిపండా వారికి చాలా తెలుసు. Probably PAS prefers to be dismally silent.

Todays' literary reality is this! విరసం విజృంభణతో అరసం వాళ్ళంతా back numbers అయిపోయారు.

చెరబండరాజు విషయంలో KVR ఒక Statement draft చేశారు. నేనూ దానికింద సంతకం చేసి "ఆంధ్రజ్యోతి" కి పంపించా.

మొన్న Hyderabad లో చెరబండరాజుని చూశాను. మన లోకంలో లేడు. Still I cling with the hope that modern science will achieve the near impossible.

"మరోప్రస్థానం" 2nd edition నేనే వెయ్యబోతున్నాను. అది చెరబండరాజుకే అంకితం.

Yours Sincerely,

Sri Sri

# 170

Madras-600028 ,

23-4-82

రమణచంద్‌కి

Dear grand Child,

Thanks for everything. Have written to Bhopal, Awaiting reply.

Your poetic efforts are good. Could be better. Send me some more.

Your prize winning essay. There are some factual errors. For instance, my birth place is విశాఖపట్టణం and not, as you say, శ్రీకాకుళం.

Always be sure of your facts. Even in poetry.

Poems may be dreams, But remember. All dreams have a strong basis in reality (సిగ్మండ్ ఫ్రాయిడ్).

You are a science student Cultivate the scientific temperament.

Shall write to you again. వెంట వెంటనే జవాబులు రాస్తూండడం అనే సద్గుణం నాలో లోపించింది.

Can't help it.

నేను జూన్ మొదటి వారంలో (4, 5, 6 అనుకుంటాను) విరసం సభల్లో పాల్గొనడానికి మాచెర్ల వెళ్తున్నాను.

Are you a member of వి.ర.సం?

more in my next.

Yours
Sri Sri

# 171

Madras,
23-4-82

ఛీ ఛీ!

మనదేశంలో పోలీసులకు స్త్రీల మానభంగాలు చెయ్యడం నిత్యకృత్యమయిపోయింది. ఇప్పుడు తెలుగుదేశంలో పోలీసులు మరో నాలుగాకులెక్కువ చదువుకొని నవలాకారిణుల సృజనాత్మక రచనలను నిషేధిస్తున్నారు. ఇందుకు వాసిరెడ్డి సీతాదేవిగారి "మరీచిక" అనే నవల సరికొత్త ఉదాహరణ. రాజ్యాంగం మనకి భావప్రకటనా స్వాతంత్ర్యాన్ని గ్యారంటీ చేస్తున్నది. కాని, పాలక వర్గ ప్రయోజనాలకు ప్రమాదం ఏర్పడుతుందంటే గ్యారంటీలన్నీ వెనుకబడి పోయి. ......పోలీసుశాఖకు చేతినిండా పని దొరుకుతుంది. ఈ వ్యాసంగంలో ఒక భాగమే "హాని"కరమైన సాహిత్యాన్ని నిషేధించడం. ఎవరికీ "హాని"? నిస్సందేహంగా పాలకవర్గానికే! పీడక వర్గమే పాలన సాగిస్తున్నప్పుడిలాంటి విపర్యాసలు సంభవిస్తూనే ఉంటాయి. వాటిని నాలాంటి వాళ్లు "ఛీఛీ" అని గర్హిస్తూనే ఉంటారు.

శ్రీశ్రీ

*డెమోక్రటిక్ లాయర్స్ ఫోరం పత్తిపాటి వెంకటేశ్వర్లుగారికి పంపినది.*

# 172

Madras,
5-5-82

బూదేశ్వర్రావుకి

Dear friend,

మీ ఉత్తరాలు అందుతూనే ఉన్నాయి. పాటల ముద్రణకు కొంచెం ఆలస్యం కావచ్చు. (కాని, జూన్ నెలాఖరులోగానే)

"ముందుమాట" రాయడానికి SP బాలసుబ్రహ్మణ్యం నిన్ననే (Vijaya gardens లో అంగీకరించాడు. మాదాల వద్ద Art Director కుమార్ ముఖ చిత్రం వేస్తున్నారు

"పాడవోయి భారతీయుడా Volume వెలువడ్డ వెంటనే "తెలుగు వీర లేవరా" Volume వస్తుంది. ఈలోగా మీరు "మరదలు పెళ్ళి" పాటల పుస్తకం, "అమర సందేశం" పుస్తకం (1st picture directed by ఆదుర్తి సుబ్బారావు) సంపాదించి పంపకోరుతాను.

Yours Sincerely ,

Sri Sri

# 173

Madras,
27-5-82

Dear Prasad,

మాచెర్లలో విరసం సభలకు వస్తున్నాను. అయితే, ఇక్కడ 4వ తేదీన బయలుదేరుతున్నాను.

లండన్ నుంచి GK గారు మీద్వారా "మహాప్రస్థానం" London Edition అందబోతుందని రాశారు. (It was given to some one who is expected to hand over the same to you.)

మీతో వచ్చినప్పుడు తీసుకురండి. అది నాకు Cancer వైద్యం చేసిన Dr. సత్యనారాయణ గారి నిమిత్తం.

More in person,

Yours Sincerely ,

Sri Sri

# 174

Madras - 28 ,
7-7-82

రమణచండీకి

Dear gran'ma!

ఇదేవిటి, వీడు నన్ను ముసలమ్మను చేస్తున్నాడనుకోవద్దు. క్యూబానుంచి GRANNMA అనే పత్రిక వస్తూంటూంది. ఒకటి రెండు సంచికలు చూశాను. చాలా రివల్యూషనరీగా వుంటుంది. అయితే శ్పానిష్ భాషలో గ్రాన్మా అనే మాటకు వేరే అర్థం ఉంది. నాకు తెలియదనుకో. ముసలమ్మ అని మాత్రం కాదు, సరే. ఇక మన సంగతి. నన్ను చూడాలని నీకున్నట్లే నిన్ను చూడాలని నాకూ వుంది. మాచెర్ల ప్రయాణం సీట్లు రిజర్వు చేసి కూడా last moment లో cancel వేసుకోవలసివచ్చింది. Blame my health for that! కళ్లు ఆపరేషన్ అన్నారు. ఇప్పుడు మరో ఆరునెలల దాకా ఆగాలంటున్నారు.

చెరబండరాజు మరణ వార్త నీకు తెలిసే ఉంటుంది. "The king is dead; long live the king" అన్నానేను ఇది బ్రిటిష్ రాజు చనిపోయినప్పుడు లండన్ ప్రజల నినాదం.

చెరబండరాజు నిధి 50 వేలు దాటింది.

ఇది అతణ్ణి పోషించలేకపోయినా బిడ్డల భవిష్యత్తుకు ఉపకరిస్తుంది.

మీ నరసరావుపేట Main line లో లేకపోవడం శోచనీయం. ఈ నెలాఖరున గాని, వచ్చేనెల మొదటి వారంలో గాని సర్దార్ ఎక్స్‌ప్రెస్‌లో నేను కాకినాడ వెళుతున్నాను. వివరాలు మళ్ళీ రాస్తాను. వీలయితే గుంటూరు స్టేషన్‌లో కలుసుకోవచ్చు.

భోపాల్ కవి సమ్మేళనం అక్టోబరులో జరుగుతుంది. ప్రసిద్ధ కవులే కావాలంటున్నారు. కనీసం ఒక్కరినైనా (Promising young poetని) ఆహ్వానించండని రాస్తాను. ఏమంటారో చూదాం.

"మరో ప్రస్థానం" 2nd edition త్వరలో నేనే వెలువరించాలనుకుంటున్నాను. అది చెరబండరాజుకు అంకితం.

Wishing you the best,

Yours Sincerely ,

Sri Sri

# 175

Madras,

29-7-82

Dear Prasad,

ఏం చెయ్యాలనుకున్నా ఎందుకు చెయ్యాలనే నిర్లిప్తత ఆవహించింది నన్ను. అందుకే ఎవరికీ ఉత్తరాలు కూడా రాయలేదు.

Perhaps that is only a passing phase.

కళ్ళకి ఆర్నెల్లదాకా, పళ్లకి ఏడాది దాకా తొందర లేదు.

రా.వి.శాస్త్రి function బాగా జరుగుతుందని ఆశిస్తున్నా. You can go ahead with my prose selections,........నా పుస్తకాలన్నీ క్రమంగా నేనే అచ్చువేయించాలనుకుంటున్నాను.

మా అమ్మాయి మంజుల ఈ యేడు MA లో యూనివర్సిటీకి first. (ఇది వరకు BA లో లాగే)

Sri Tummala[1] from the States was here, the other day. త్వరలో Vizag వెళ్తున్నట్టు చెప్పేరు.

Yours ,

Sri Sri

*1. తుమ్మల కృష్ణకుమార్ - శ్రీశ్రీ దంపతులకి అమెరికాలో ఆతిథ్య మిచ్చిన ఒక మిత్రుడు.*

# 176

Madras,
29-8-82

బాదేశ్వర్రావుకి

Dear friend,

నేను Sep 11 వ తేదీని రేపల్లెకు వెళ్తున్నాను. అక్కడ ఒక సన్మానం మన మిత్రులు ఏర్పాటు చేస్తున్నారు.

ఆ మరునాడు విజయవాడ వచ్చి, స్వాతి లో "పాడవోయి భారతీయుడా" (శ్రీశ్రీ సినిమా పాటలు) SPB ముందుమాటతో అచ్చుకి ఇస్తున్నాను. విజయవాడలో నేను Swati పత్రిక Editor వేమూరి బలరాం గారి guest గా ఉంటాను. You can meet me there with or without మరదలు పెళ్ళి, వాగ్దానము, అసాధ్యుడు song books. దొరికితే తీసుకురండి.

మరో సంగతి 11 ముందుగానే విజయవాడ వచ్చి అక్కడ పనులు పూర్తి చేసుకుని రేపల్లెకు వెళ్ళవచ్చును. Definite date and place మీకు 3,4 days లో ముందుగా తెలియజేస్తాను.

Yours Sincerely ,
Sri Sri

# 177

Madras,
4-9-82

రమణచంద్‌కి

Dear old Baby,

Sorry as usual for this delay in replying.

నేనూ మా ఆవిడా ఈనెల 11వ తేదీని రేపల్లెలో ఉంటాం. ఆరోజు, అక్కడ మిత్రులు నాకో సన్మానం చేస్తున్నారు.

రేపల్లె నుంచి మేము విజయవాడ వెళ్ళి 15వ తేదీదాకా ఉంటాం. బహుశా Hotel Manorama లో.

నా సినిమా పాటల్లో కొన్నింటిని ఒక చిన్న volume గా వేయించాలని ఉంది. Swati పత్రిక editor శ్రీ బలరాం ఈ బాధ్యత తీసుకుంటున్నాడు.

కాకినాడ Function కి నాకు invitation లేదు. ఆ ప్రయాణం cancel అయిపోయినట్టే.

"సృజన" (from వరంగల్) "అరుణతార" (from కావలి) అని రెండు పత్రికలున్నాయి. ఈ రెండింటికీ నువ్వు annual subscription పంపితే బాగుంటుంది. రెండు పత్రికలూ తమ latest issues ముఖచిత్రంగా చెరబండరాజు photo వేశాయి.

Get into touch with their editorials.

పెండ్యాల వరవరరావు, Editor సృజన, Warangal, KV రమణారెడ్డి, Editor అరుణతార, Kavali అని రాస్తే చాలు.

Yours Sincerely ,
Sri Sri

## 178

Madras,
4-9-82

Dear Prasad,

మీ ఉత్తరాలన్నీ అందుతున్నాయి. అశ్రద్ధతో పాటు అనాసక్తి కూడా పెరిగిపోతోంది. అందుకే ఈ మౌనం.

కళ్ళు, పళ్ళ వైద్యం 1983లోనే. ఈలోగా I'll not meddle through. దృష్టి ఆనడంలేదు. నిజమే. కాని పురాణం sensationalise చేస్తున్నంతగా కాదు.

ఈ నెల 11వ తేదీని నాకో సన్మానం ఉంది. వెళుతున్నాను. సన్మానాలన్నింటికీ సలాం కొట్టెయ్యాలనుకున్నా, ఆర్థికంగా నా పరిస్థితి మళ్ళా మొదటి కొచ్చింది. ఏం చెయ్యను? రామప్పంతులు చెప్పినట్లు "కొంచెం చిల్లర ఖర్చుంది".

పురాణం ఉత్తరం రాశాడు, "రావి శాస్త్రీయం" రివ్యూ చెయ్యమని. చలసాని ప్రసాద్ కోరినట్టుగా అని రాశాడు. రేపల్లెనుంచీ విజయవాడ వెళ్ళి అక్కడ review రాస్తాను. "వ్యాపార నాగరికత వికటాట్టహాసం చేస్తోం"దని మనం ఏడుస్తూ కూర్చుంటే లాభం లేదు. Exploit the exploiters అంటాన్నేను. Shaw లాగ, Chaplin లాగ దోపిడి దొంగల్ని వాళ్ళ రూల్సు ప్రకారమే దుళ్ళగొట్టాలి. అలాగని నేను నక్సలిజాన్ని ఖండించను. చెరబండ రాజును నిందించను. అందరూ చెురాలు కాలేరు.

మీరు essays మాత్రం వెయ్యండి. త్వరలోనే "శ్రీశ్రీ ప్రచురణలు" imprint తో ఒక series ప్రారంభిస్తున్నాను.

The time is not yet, to think about the disposal of my corpse. విశాఖ నాస్తిక సమాజం claim కూడా అంత కొట్టి పారెయ్యదగ్గది కాదు.

Miss. S. Manjula M.A. ఈ మధ్యనే I.A.S. ప్రిలిమినరి కూడా Pass అయింది.

Cheers
Sri Sri

## 179

Madras,
16-11-82

మానేపల్లికి

Dear సత్యనారాయణగారు,

"అవగాహన" లన్నీ చూస్తున్నాను.

ప్రస్తుతం నేను "శ్రీశ్రీ ప్రచురణలు" అనే Publishing concern లో తలమునకలుగా వున్నాను. Publication లో విశేషమేమీలేదు. Distribution లో విలక్షణమైన ఒక పద్ధతి అవలంబిస్తున్నాము.

Sri Sri Library ద్వారా ఇకమీద నారచనలన్నీ నా పాఠకులకు నేనే అందజేస్తాను. ఈ లైబ్రరీకి 5వేల మంది సభ్యులు కావాలి.

శ్రీశ్రీ లైబ్రరీకి మీరు కనీసం 10 మంది సభ్యులను (including yourself) చేర్చాలి. సభ్యత్వపు రుసుము ఒక రూపాయి. రసీదులకు బదులు (10 రూ.లకు పుస్తకం వెల) తీసుకున్న మొదటి ప్రచురణలో సభ్యత్వపు నెంబరూ నా autograph వుంటాయి.

Yours

Sri Sri

# 180

Madras,

6-1-83

Dear Prasad,

మీ 1-1-83 ఉత్తరం అందింది. There is a slight set back in my health. వరసగా 10 రోజులు treatment తీసుకోవాలి.

విరసం పాఠశాలకి రావాలని ప్రయత్నిస్తున్నాను. (Health permitting)

నా voice చాలా feeble గా ఉంది. మాట్లాడితే ఆయాసం వస్తోంది. Vocal chords చెడిపోలేదని డాక్టరుగారు చెప్పారు.

మీ సంకలనంలో ప్ర/జ వెయ్యవద్దు. అలాగే, నవరసాల శ్రీశ్రీ కూడా. పేజీల సంఖ్య తగ్గినా ఫర్వాలేదు.

Air Bus టెక్నిక్ మనకు అనవసరం.

Yours Sincerely

Sri Sri

# 181

London,

27-1-1983

Dear Dr. నారాయణరావుగారు,

మీ ఉత్తరం, తెలుగు Cultural assn ఆహ్వానమూ నిన్ననే అందాయి. Thus the decks are cleared for our states visit అయితే ఒక చిన్న hitch. డబ్బుకి సంబంధించినది.

మేము ఇండియా నుండి 20 పౌన్లతో వచ్చాము. (అంతవరకే గవర్నమెంటు అనుమతించింది) ఈ నాలుగు నెలలూ Dr GK గారే అన్ని ఖర్చులూ భరిస్తున్నారు, హీనపక్షం ఒక వెయ్యి పౌన్లయినా మా మీద ఖర్చయిపోయి ఉంటాయి పైగా, ఆయన నా పుస్తకం ఒకటి అచ్చు వేయిస్తున్నారు (మహా ప్రస్థానం గేయాలన్ని special paper మీద special ball point pen తో రాశాను 128 పేజీలు. వీటికి facsimile తీయిస్తున్నారు. దీనికి నేనే ఒక special intro కూడా రాశాను. అవన్నీ నా సొంత దస్తూరీలో నే ఉంటాయి. వీటితో బాటు artist Bapu (మీకు తెలుసు ననుకుంటాను.)

He is also film producer, director గారి వర్ణచిత్రాలుంటాయి. వీటి printing cost 7000 పౌన్లు (550 కాపీలకు) ఇంతలో ఆగిపోలేదు. నా poems అన్నీ Tape record చేసిన cassettes (550) దీనికి మరో 3000 పౌన్లు. అచ్చుపని ప్రారంభమైపోయింది అన్ని numbered copies అన్నిటి మీదా నేను autograph చేస్తాను. This is the scheme ఇందు కోసం ఇన్నాళ్ళు ఆలస్యమయింది.

Plane fares కీ అమెరికాలో పర్యటనకి £ 1000 అడిగితే Dr GK గారు తప్పకుండా ఇస్తారు. నేను మొగమాట పడుతున్నాను ముమ్ముందు ఎప్పుడో నాకు రాబోయే royalties నుంచి ఇప్పుడే advance ఇయ్యండని అడగడమా అని ఆలోచిస్తున్నాను. Houston లో దిగీదిగగానే చాలాచోట్ల నుంచి నాకు ఆహ్వానాలు వస్తాయి. న్యూయార్క్ మిత్రులకే గాక మరికొన్ని ప్రాంతాలవారి క్కూడా రాయండి మేము రావడం ఖాయం. Definitely between 13th and 15th Feb.

నేను రాగానే చేసే మొట్ట మొదటి పని మీరు Draft చేసే విధంగా blanket permission మీద సంతకం పెట్టడం. మీ శ్రమవృధాపోదని, తప్పకుండా ఎంతోకొంత లాభమే వస్తుందనీ నేను దృఢంగా విశ్వసిస్తున్నాను.

ఈ చంద్రుడికి మీరివ్వదలచిన నూలుపోగు కూడా వద్దు. నాకు మా ఆవిడకి మీ association ద్వారా return tickets పంపమనండి. అలాకాకుంటే London to Houston మాత్రమే అయినా చాలు. I am not worried about our return journey (London to Madras టిక్కట్లు మా వద్ద సిద్ధంగా ఉన్నాయి.)

ఫిబ్రవరి నెలాఖరు దాకా మాకు U.K. Visas ఉన్నాయి.

మీకు Dr. T.S.R. Murti (తణికెళ్ళ సుందరరామమూర్తి) తెలుసునా? నాకతను బాల్యమిత్రుడు. Indian Armyలో మేజరుగా వుండి, ఆ తర్వాత అమెరికాలో స్థిరపడిపోయాడు. అంత పెద్ద దేశంలో ఒక వ్యక్తి చిరునామా కనుక్కోవడం కష్టమే అని నాకు తెలుసును. అయినా ప్రయత్నించి చూడండి. (ఈ స్నేహితుడి ద్వారా నేను లక్నోలో 2nd Lieutenant గా ఏడు నెలలపాటు మిలటరీ కొలువు వెలిగించాను. సరే అది వేరేకథ.)

And finally I would like to say, మా ప్రయాణ విషయంలో మీకు ఇబ్బంది పడవలసి ఉంటే ఆ విషయమే మరిచిపొండి. ఎలాగో మేమే వచ్చేస్తాం. అది యెలాగా అని ఆలోచించడానికి చాలా వ్యవధి వుంది.

ఇందులో నా అభివందనాలందుకొని అచ్చటి మన వారందరికీ అందించండి.

Yours Sincerely ,

శ్రీ శ్రీ

## 182

Madras,
18-2-83

రమణచంద్‌కి

My dear love,

But this is not a love letter. Rather, it is strictly business. అది యెట్లన్నన్ - ఇక మీద నా పుస్తకాలన్నీ నేను ప్రచురించే ఉద్దేశంతో "శ్రీశ్రీ ప్రచురణలు" అని ఒక

సంస్థను ప్రారంభించాను. మొదటి పుస్తకం "పాడవోయి భారతీయుడా" అనేది ఇందులో నా సినిమా పాటలూ, పద్యాలూ (వివరణలతో, వ్యాఖ్యలతో సహా) ఉంటాయి. పుస్తకం ముద్రణ పూర్తి అయింది. వెల 10 రూ.॥

నా పుస్తకాలు పాఠకులకు అందజేసే బాధ్యత కూడా నేనే తీసుకుని, ఇందుకుగాను ఒక పద్ధతి ఆలోచించాను. అది యేదన్నస్ -

శ్రీశ్రీ ప్రచురణలన్నీ శ్రీశ్రీ లైబ్రరీ ద్వారా పాఠకులకు అందుతాయి. లైబ్రరీ సభ్యత్వం ఒక రూపాయి. అయితే ఒక్కొక్కరికీ individual జవాబు రాయడం (సభ్యత్వం వేల సంఖ్యలో ఉన్నప్పుడు) కష్టం కాబట్టి, కనీసం పదేసిమంది ఒక గ్రూపుగా 110రూ. నాకు పంపితే, పది పుస్తకాలూ ఒకే వ్యక్తికి అందజేస్తాను. (సభ్యుల జాబితాలో మొదటి వ్యక్తి పేరు)So, this is what I expect from you.

నాకు పదిపేర్లూ, పది చిరునామాలూ కావాలి. (అందులో మొదటి పేరు నీదే) ఒక్కొక్కరి వద్ద 11 రూ. collect చేసి, నాకు 110 రూ. పంపించాలి. అప్పుడు నీకు పది పుస్తకాలు పంపిస్తాను. ఒక్కొక్క పుస్తకంలో అతని పేరూ, చిరునామా, సభ్యత్వపు సంఖ్యా మాత్రమే కాక, నా autograph కూడా ఉంటుంది.

110 రూ. పంపమన్నారు కదా అని ముందుగా ఆదబ్బు నువ్వే పంపి తర్వాత తతిమ్మా తొమ్మండుగురి కోసం వెతుక్కోవద్దు. తొందరేమీ లేదు. Take your own time. collect 99rs. from 9 persons and then send me Rs. 110/- (adding your membership fee and cost of the book amounting to Rs. 11)పదిపేర్లూ, పది చిరునామాలూ ముఖ్యం. పదిమంది కంటే ఎక్కువ సభ్యుల్ని చేర్పించగలిగావంటే మరీ సంతోషం. But I expect a minimum of ten names & addresses from you.

నేను ఉత్తరం రాయడంలో ఆలసిస్తున్నానని నువ్వూ నన్ను అనుకరించవద్దు. సభ్యత్వ సేకరణకు ప్రారంభించానని ఒక ఉత్తరం ముక్కరాయి.

ఇట్లు నీ ప్రియతమ

శ్రీశ్రీ

# 183

No.1, South Bank Rd, Madras-28.

10-3-83

మానేపల్లికి

Dear Satyanarayana Garu,.

At last శ్రీశ్రీ ప్రచురణలు has started. The first publication పాడవోయి భారతీయుడా (My cinema songs & verses with notes and comments) is ready. You have enlisted ten members for my Sri Sri library. Kindly give me their names and addresses and send 100 Rs. M.O. I shall send 10 copies to your address. Each copy will have the membership number, the name & address as well as my autograph.

Yours Sincerely ,

Sri Sri

# 184

Madras,
17-3-83

Dear Satyanarayana Garu,

I am this day sending you a V.P. Parcel for Rs. 100/- it contains ten copies of "పాడవోయి భారతీయుడా" (cost of each copy is Rs. 10). The amount of 10 Rs. which you sent some time ago is membership fee of ten members.

Try to enrol more members for Sri Sri Library, at your leisure. They have the first preferences to secure all శ్రీశ్రీ ప్రచురణలు

Yours Sincerely ,
Sri Sri

# 185

Madras, 17-3-83

Dear Satyanarayana Garu,

V.P. పద్ధతి పెట్టదలచుకోలేదు. కాని మీ విషయంలో మినహాయింపు పాటిస్తున్నాను. మరో 9 పేర్లు, చిరునామాలూ నాకు పంపించండి. వాళ్ళ సభ్యత్వపు సంఖ్యలు మాత్రం పుస్తకాల్లో వుంటాయి. (as well as my autograph). ప్రతి పుస్తకంలోనూ పేరూ, చిరునామా (టూకీగా) మీరు fill up చేసి ఎవరి పుస్తకం వారికి అందచెయ్యండి.

Many thanks for your prompt response.

నాకు పంపే జాబితాలో మాత్రం పేరూ, చిరునామా పూర్తిగా రాయండి. (Membership number తో సహా)

శ్రీశ్రీ ప్రచురణలలో రెండో పుస్తకం సిప్రాలి. అనగా సిరిసిరిమువ్వలు
ప్రాసక్రీడలు
లిమబుక్కులు

ఇది త్వరలోనే అచ్చుకిస్తున్నాను.

Yours Sincerely ,
Sri Sri

శ్రీశ్రీ ప్రచురణల scheme సక్రమంగా అమలు చెయ్యగలిగితే నాకు Noble prize మాత్రమే కాదు, జ్ఞానపీఠ్ award కూడా అఖ్ఖర్లేదు. (ఇస్తే వొద్దనన్లెండి. అది వేరేసంగతి)

పురిపండా మహాప్రస్థానం గూర్చి మీ సుదీర్ఘలేఖ touched me to the quick.

My health is ok. కాని త్వరలో కళ్ళకి cataract ఆపరేషన్ చేయించుకోవాలి.

Wishing you the best
Yours Sincerely,
Sri Sri

# 186

Madras,
19-3-83

Dear కై,

Grace period లోగా తర్జుమాలు పంపిస్తాను. హైద్రాబాదులో హరినీ, B.N. రెడ్డి గారినీ కలిశాను. April నెలలో documentary షూటింగ్ జరుగుతుంది. 3rd week లో Vizag వస్తున్నాము. అప్పుడు 50 copies శ్రీశ్రీ ప్రచురణలు తెస్తాను. వీలయినంత మందిని సభ్యులుగా చేర్పించండి. మీ విశాఖ quota 5 వందలు. Halley's comet వచ్చి, పోయేలోగా కోటా పూర్తి చెయ్యండి.

ఆరోగ్యం ok. Chemotherapy తీసుకోవాలట. That can wait.

తాత్కాలికంగా పళ్ళూ, కళ్ళు తెచ్చుకున్నాను. ఏవీ సరిగా పనిచెయ్యలేదు.

రేపు (Sunday) సాయంత్రం Palm grove లో కృష్ణశాస్త్రి సాహితి ఆవిష్కరిస్తున్నాను.

Yours Sincerely ,

శ్రీశ్రీ



# ముగింపు మాటలు

ఎట్టకేలకి శ్రీశ్రీ సాహిత్య సర్వస్వం ఇరవై సంపుటాలు విరసం ప్రచురించింది. జాబులు (11వ సంపుటం) చిట్టచివరికి తెస్తున్నాం. ఈ సమయంలో కొన్ని ఇక్కట్లు ముచ్చట్లు అందరితో చెప్పుకోవాలనిపించింది. విరసంకి ఏ వనరులు లేవు. మాకు సొంత ఆఫీసులేదు. బ్యాంక్ అకౌంటు లేదు. అరుణతార మాసపత్రిక నిర్వహణ అష్టకష్టాలతో కూడుకుని వుందని అందరూ ఎరిగినదే. అయినా సాహసించి శ్రీశ్రీ సాహిత్య ప్రచురణకి పూనుకున్నాం. ఇది మేము మోయలేని బరువని మాకు తెలుసు. కేతవరపు వెంకటరామకోటి శాస్త్రి గారు, వెల్చేరు నారాయణరావు గారు తొలిదశలో ఈ పనికి మమ్మల్ని ప్రోత్సహించారు. ఇప్పుడు రామకోటి శాస్త్రి గారులేరు. వెల్చేరు వుండీ లేనట్టే అయింది. వారు అమెరికాకి అంటిపెట్టుకు పోయారు. మాది పూలబాటకాదని మాకు తెలిసినా ముందుకుసాగాం. ముళ్ళు, రాళ్ళు, అవాంతరాలు ఎన్నో ఎదురయ్యాయి. గతుకుల్లో పడ్డాం. ఎదురు దెబ్బలు తిన్నాం. అయినా అన్నింటిని అధిగమించాం. అనంతం (ఆఖరి సంపుటం - 20వది) తొలిగా (1986) ప్రచురించాం. ఆఖరికి జాబులు (11వది) ఇప్పుడు ప్రచురించగలుగు తున్నాం. ఈ 20 సంపుటాల ప్రచురణకి మాకు పదమూడేళ్ళు పట్టింది. బోలెడు డబ్బు ఖర్చయింది. తల తాకట్టు పెట్టి ఎంతో డబ్బు తెచ్చాం. ఇంకా ఎందరెందరో మిత్రులు, సాహితీ మిత్రులు ఉదారంగా మమ్మల్ని ఆదుకున్నారు. అందరి అండదండలవల్లనే మా పూనిక నెరవేరింది.

అయితే ఇందుకు పూర్వరంగం వివరించవలసి వుంది. విశాఖపట్నం (1-2-1970)లో శ్రీశ్రీ సన్మాన సభ ఒక చారిత్రక సన్నివేశం. స్థానికులతో ఆరునెలల ముందే సన్మాన సంఘం ఏర్పడింది. కొన్ని నెలల తరువాత అది ఆహ్వాన సంఘంగా రాష్ట్రమంతటా విస్తరించింది. శ్రీశ్రీ సాహిత్య సంపుటాలు ప్రచురించాలని సన్మానసంఘం నిర్ణయించుకుంది. అప్పటికే ఆరుద్రగారు 'మద్రాసులో ఒక కాలు బొంబాయిలో ఒకకాలు పెట్టి వున్నందున కె.వి.ఆర్.ని కూర్పరిగా వుండమని, సన్మాన సంఘం కోరింది. కె.వి.ఆర్ అందుకు అంగీకరించారు. చాలా తక్కువ వ్యవధిలో ఎక్కువ శ్రమపడి సేకరించి శ్రీశ్రీ సాహిత్య సంపుటాలు (అయిదు తెలుగు, ఒక ఇంగ్లీషు) సన్మానసభ (1-2-1970) నాటికి కె.వి.ఆర్ తీసుకొచ్చారు. ప్రచురణ బాధ్యత మాత్రం సన్మానసంఘుంది. కె.వి.ఆర్ పూనిక నిస్సందేహంగా అనితర సాధ్యం. ఒక్క చేతిమీదుగా ఆయన పడ్డశ్రమ వ్యక్తులకే గాదు, సాహిత్య సంఘాలకి కూడా ఒక గొప్ప ఆదర్శంగా నిలుస్తుంది. ఫుట్‌నోట్స్‌లో ఆయన ఎంతో ప్రామాణికమైన సమాచారాన్ని సమకూర్చారు. అయితే ఎంత ప్రయత్నించినా శ్రీశ్రీ రచనలు అప్పటికి కొన్ని దొరకలేదు. దొరికిన వాటిని కావ్య, వచన విభాగాలుగా చేసి కాలక్రమంలో కూర్చారు కె.వి.ఆర్.

శ్రీశ్రీ 1970 తరువాత మరో పదమూడేళ్ళు (1983 వరకూ) రాశారు. అప్పటికి (1970 నాటికి) దొరకని వాటినీ, ఆ తరువాత (1970-83) రాసినవాటిని కలిపి విరసం ఇప్పుడు 20 సంపుటాలుగా ప్రచురించింది. ప్రక్రియపరంగా కూర్చగలిగాం. ఒక రకంగా చెప్పాలంటే శ్రీశ్రీ సన్మానసంఘం 1969లో చేపట్టిన పనిని విరసం 1986 నించి కొనసాగించింది. సన్మాన సంఘం కె.వి.ఆర్ కి అప్పగించినట్టే విరసం నాకు ఈ బాధ్యతని అప్పగించింది. కె.వి.ఆర్ కృషిని నేను కొనసాగించి పూర్తిచేశాను. శ్రీశ్రీ రచనలు ప్రామాణికంగా, నిర్దుష్టంగా రావాలనే విరసం సంకల్పం. ఇది ఎంతవరకు నెరవేరిందో తెలుగు సాహిత్యలోకం నిర్ణయించాలి. సాహిత్య సంస్థకే ఈ ప్రచురణ పని సాధ్యమయింది.

సాహిత్య సంఘాలనీ, సంస్థలనీ చులకనగా మాట్లాడ్డం ఇవాళ పరిపాటయిపోయింది. ఆధునిక తెలుగు సాహిత్య చరిత్ర పుటలు తిరగవేస్తే, సాహిత్య సంఘాల నిర్మాణం మనకి కొత్త కాదని తెలుస్తుంది. "సాహితీ పరులు ఒక సంఘంగా ఏర్పడవలసిన ఆవశ్యకతను ఆంధ్రసాహిత్య పరిషత్తు మొట్టమొదట గుర్తించిం(ది)..."

"ఒక్క శ్రీనాథుని శివరాత్రి మహాత్మ్యం ప్రచురించినందుకే పరిషత్తు జన్మ సార్థకమయిందని నే నొప్పుకోగలను....."అన్నాడు శ్రీశ్రీ (1949లోనే). ఆంధ్రసాహిత్య పరిషత్తు కాకినాడ (1911)లో ఏర్పడింది. శ్రీనాథుడి 'శివరాత్రి మహాత్మ్యం' అసంపూర్తిగా (నాలుగు ఆశ్వాసాలు మాత్రమే) ప్రచురించింది - 1918లో. ఈ పుస్తకాన్ని పూర్తిగా ప్రచురించగలిగింది (1966లో) ఆంధ్రసారస్వత పరిషత్తు. ఈ సంస్థ హైదరాబాద్ (1943)లో ఏర్పడింది. బిరుదురాజు రామరాజు గారి సంపాదకత్వంలో శ్రీనాథుడి పుస్తకం వెలువడింది. తెలుగు సాహిత్యంలో పుస్తకాల ప్రచురణకి ఇంత చరిత్ర వుంది.

అలాగే శ్రీశ్రీ సాహిత్య సర్వస్వం 20 సంపుటాల ప్రచురణ గురించి చెప్పుకోవాలంటే ముందుగా విరసం సంస్థని గురించి చెప్పుకోవాలి. ఒక పథకం వేసుకుని దానిని ఆచరణలో అమలు పరిచింది విరసం. అయినా వ్యక్తుల కృషి తోడ్పాటు విరసం ఎప్పటికీ మర్చిపోదు. విరసం సంస్థలోని సభ్యులు ఎన్నో రూపాలలో, ఎన్నో రకాలుగా ఈ ప్రాజెక్టులో పాల్గొన్నారు. ఎందరెందరి శ్రమ, కృషి, పట్టుదల ఈ పుస్తకాలలో దాగివున్నాయో వాటిలోని ప్రతి అక్షరానికి తెలుసు. విరసం నిర్మాణంలో లేకపోయినా శ్రీశ్రీ సాహిత్య సంపుటాలపై ఎందరో ఆసక్తి కనబరిచారు. తమ దగ్గరున్న శ్రీశ్రీ రచనలని పంపి సహకరించిన వారెందరో వున్నారు. ప్రతి సంపుటంలోనూ వారిని పేర్కొన్నాం. అయినా మరో మారు అందరినీ గుర్తుచేసుకుంటున్నాం.

'అనంతం' (1986)నించీ, 'రెక్కవిప్పిన రివల్యూషన్' (1996) వరకు పది సంపుటాల ప్రచురణకి విశేషంగా తోడ్పడి, ఎంతో కృషి చేసింది

వేమన వసంతలక్ష్మి తన ఉద్యోగంలో ఎన్నో ఒడిదుడుకులు ఎదుర్కొంటూ, ఊళ్ళు మారుతూ కూడా మా పుస్తకాల ప్రచురణకి ఎంతగానో తోడ్పడింది. పుస్తకాలని అందంగా, అర్థవంతంగా తెచ్చింది. ఆమెకి మా ప్రత్యేక కృతజ్ఞతలు. అలాగే విరసం డబ్బు ఇవ్వలేదని తెలిసికూడా ఆర్టిస్టు మోహన్ ఎన్నో అమూల్యమైన బొమ్మలు గీసి పెట్టాడు. మా మోహన్‌మేలు మేమెన్నటికీ మరిచిపోలేము. పేరు పేరునా పేర్కొనాలంటే పట్టిక చాలా పెద్దదవుతుంది. పుస్తకాలు చక్కగా అచ్చువేసి ఇచ్చిన ప్రగతి ఆర్ట్ ప్రింటర్సు పరుచూరి హనుమంతరావు, చరిత గ్రాఫిక్సు పరుచూరి సుబ్బయ్యగార్లు ఎప్పటికీ మా ఆత్మీయులే. శ్రీశ్రీ రచనలని అందంగా అక్షరమక్షరం తీర్చిదిద్దిన నిర్మల (ఫాంట్‌లైన్ గ్రాఫిక్స్, హైద్రాబాద్), రవికుమార్ (శ్రీ సాయి షామిలి గ్రాఫిక్స్, హైద్రాబాద్) మేం మరిచిపోలేని మా ఆత్మీయ మిత్రులే.

విరసం సభ్యుడయినప్పటికీ మా ఆర్.కె.ని గురించి ప్రత్యేకంగా చెప్పి తీరాలి. 'చైనా యానం' (1997) నించి 'జాబులు' (1999) వరకు పది సంపుటాలు 2సం॥ల అతి తక్కువ వ్యవధిలో తీసుకురావడంలో ఆర్.కె. కృషి, పట్టుదల, పరిశ్రమ మరిచిపోగూడనివి, మరువలేనివి. ఉద్యోగం, ఇతర పనులతో పాటు, 'ప ర్ స్పె క్టి వ్స్' ప్రచురణ సంస్థ నిర్వహణ బాధ్యత ఉండి కూడా శ్రీశ్రీ సంపుటాల ప్రచురణని ఒడుపుగా, ఓపిగ్గా పూర్తిచేసిన ఆర్.కె.ని మెచ్చకుండా ఉండలేము. శ్రీశ్రీ సాహిత్య సంపుటాలలో ఫుట్‌నోట్స్‌కి ఎందరో సాహితీవేత్తలు సహకరించారు. వారందరికీ మా కృతజ్ఞతలు. అలాగే శ్రీశ్రీ పుస్తకాలని సకాలంలో సమీక్షించి పదిమందికి తెలియడానికి తోడ్పడిన పాత్రికేయ మిత్రులెందరోవున్నారు. మా ప్రయత్నాన్ని, కృషిని హర్షించి మాకు బాసటగా నిలబడ్డారు. వారందరికీ మా కృతజ్ఞత.

'జాబులు' అన్నీ వద్దనుకున్నాం. కేవలం మాటర్ ఆఫ్ ఫాక్టుగానూ, ఉత్త ఇన్‌ఫర్‌మేషన్‌తోనూ ఉన్నవాటిని వదిలేశాం. సాహిత్య, సాంస్కృతిక అంశాలతో నిండివుండి, సామాజిక సందర్భం వున్న వాటిని మాత్రమే వేశాం. రాజకీయ, చారిత్రక విషయాలపైన వెలుగు ప్రసరింపచేస్తాయనుకున్న వాటిని పొందుపరిచాం.

అనేక ఇబ్బందులవలన మేము 'అనంతం' రెండోముద్రణని మేము వేయలేకపోతున్నాం. ఆ వెలితి మమ్మల్ని కలతపెడుతూనే వుంటుంది. అనంతం మొదటి ముద్రణలో అనివార్యంగా చోటు చేసుకున్న కొన్ని లోపాలు, తప్పుల్ని సవరించి సమగ్రంగా సంపూర్ణంగా 'అనంతం' మరో ముద్రణని తీసుకురాగల పరిస్థితులు ఏర్పడతాయనే విశ్వాసంతో మేం వున్నాం. సాధ్యాసాధ్యాలని కాలానికే వదిలి వేస్తున్నాం.

చలసాని ప్రసాద్